

# కొలనుపాక మేదరిమఠం

## మేదరిపురాణం - దానపత్రిక



సంపాదకుడు

డా. కొండా శ్రీనివాసులు





Dr. Priyadarsini Vijaisri
Centre for the Study of Developing Societies
Delhi

# కొలనుపాక మేదరి మఠం

(మేదరి పురాణం - దానపత్రిక)

సంపాదకుడు

కొండా శ్రీనివాసులు

Dr. Priyadarsini Vijaisri

Centre for the Study of Developing Societies

DELHI

2019

కొలనుపాక మేదరి మఠం (మేదరి పురాణం - దానపత్రిక)
సంపాదకుడు - కొండా శ్రీనివాసులు

ప్రథమ ముద్రణ -2019



ప్రతులు:

ప్రతులకు:
గురువులు మేదరి మఠం నాగేంద్రయ్య (9290991708)
మేదరి మఠం ప్రవీణ్ స్వామి (9704922629)
మేదరిమఠం, కొలనుపాక - 508101
యాదాద్రి భువనగిరి జిల్లా,
తెలంగాణా.

**This book is Published with the Financial Assistance of Centre for the Study of Developing Societies Delhi**

**Published by**
**Dr. Priyadarsini Vijaisri**
**Centre for the Study of Developing Societies**
**Delhi**

ప్రింటింగ్
సెశ్విత గ్రాఫిక్స్,పూర్ణ
ఆఫ్‌సెట్ ప్రింటర్స్,అద్దంకి

# విషయ సూచిక

# కృతజ్ఞతలు

కొలనుపాక మేదరిమతం (మేదరిపురాణము- దానపత్రిక) పుస్తకానికి సంపాదకుడిగా నాకు అవకాశం ఇచ్చిన డా. ప్రియదర్శిని విజయశ్రీ, ఆచార్య యాగాటి చిన్నారావులకు, మేదరిమతం దానపత్రిక పరిష్కరణలో తగు సలహాలిచ్చిన డా॥ అవధానం ఉమామహేశ్వరశాస్త్రి, డా॥బద్దేల రామచంద్రారెడ్డి మరియు డా॥ దామరాజు సూర్యకుమార్ గార్లకు, మేదరిమతం గురువులనుండి విషయసేకరణలో తోడ్పడ్డ ఆచార్య తాళ్ళపల్లి మనోహర్, డా. ఆకుల కుమారస్వామి, శ్రీ తీగల శ్రీనివాస్‌లకు, ఈ పుస్తకాన్ని అందంగా డీ.టీ.పి. చేసిన శ్రీ పూర్ణచంద్ర(అద్దంకి), శ్రీ ఎమ్.జి.సోమయాజులు(విజయవాడ), ముద్రించిన సెశ్వితా గ్రాఫిక్స్(అద్దంకి)వారికి నా కృతజ్ఞతలు.

కొండా శ్రీనివాసులు

# ముందు మాట

ఈ మేదరిపురాణము ప్రచురణలో నేను సైతం భాగస్వామినైనందుకు ఎంతగానో ఆనందిస్తున్నాను. ఆధునికత సంస్కృతి మరియు సాంస్కృతిక రంగాలపై తీవ్రమైన దాడి జరుపుతున్న మరియు దేశీయ విజ్ఞాన వ్యవస్థలు కాలక్రమేణా అంతరిస్తున్న కాలంలో మనం జీవిస్తున్నాము. అనేక సామాజిక సమూహాలు తమకే సొంతమైన, తమ మనుగడకు మూలకారణమైన స్వకీయమైన మరియు సాంప్రదాయ కంగా వస్తున్న విజ్ఞానం క్రమంగా క్షీణిస్తున్నది. అయినప్పటికి అనేక కులాలకు చెందినవారి కుల గురువులు ఈ సంప్రదాయ విజ్ఞానం సజీవముగా ఉంచడానికి ఇతోధికంగా శాయశక్తుల కృషి చేస్తున్నారు. తెలంగాణా రాష్ట్రంలో ఈ శ్రేష్ఠమైన సాంప్రదాయ సాంస్కృతిక, విజ్ఞాన రూపాలు నిరంతరము ఏదో రూపంలో ప్రతిధ్వనిస్తూనే వున్నాయని పరిగణించడంలో అతిశయోక్తి లేదేమో. పరిశోధకుల విజ్ఞాన సముపార్జనకు ఈ విలువైన వనరులు తరగని నిధి.

ఇటీవల కాలంలో ఈ స్వకీయమైన విజ్ఞానానికున్న అపరిమితమైన విలువ గుర్తించబడింది. వివిధ జాతుల మౌఖిక సాంప్రదాయాలను మరియు కళలను సంరక్షించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అనేక విశ్వవిద్యాలయాలు మరియు సంస్థలు మరుగున పడిపోతున్న ఈ విజ్ఞానంపై దృష్టి సారించి, ఈ జానపద విజ్ఞానాన్ని, కళారూపాలను అనేక పద్ధతులలో భద్రపరుస్తున్నారు. తద్వారా పరిశోధకులు ఈ వనరులను వినియోగించుకొని పరిశోధనలను కొనసాగిస్తున్నారు. ఇదే కోవలో కొందరు వ్యక్తులు కూడా ఈ సాంప్రదాయ విజ్ఞానం విలువను గుర్తించి భద్రపరిచే పనిలో నిమగ్నమై వున్నారు. అనేక సామాజిక వర్గాలకు చెందిన ప్రజలు తమ సాంప్రదాయ వృత్తులను కొనసాగించడానికి అదేవిధంగా తమకే సొంతమైన విజ్ఞానాన్ని భద్రపరచడానికి అనాసక్తత చూపించడం కారణంగాను మరియు ఆధునికత యొక్క దండయాత్రల మూలంగాను కనుమరుగై పోతున్న స్వదేశీయమైన విజ్ఞానఖని గురించి జాగృతి కలుగజేసి, దీనిని భావితరాలకు అందించవలసిన భాధ్యత మనందరిపైనా వున్నది. ఈ అంతరించి పోతున్న విజ్ఞానాన్ని ఆయా సామాజిక సమూహాల కొరకే కాకుండా, క్షీణిస్తూ పోతున్న ఆయా తెగల సంప్రదాయ విజ్ఞానాన్ని భద్రపరిచేందుకు గాను, దానిని గ్రంథస్తంచేయాల్సిన అవసరం ఎంతైనా వున్నది.

మౌఖికత మరియు ప్రదర్శనలో వుండే విలక్షణత కొరవడినప్పటికి, ఈ కళలను విజ్ఞానాన్ని పరిరక్షించడానికి ఇంతకంటే వేరే మార్గము, గత్యంతరము లేదేమో. బహుశా ఈ నేపథ్యంలోనే "తక్షణ మానవ జాతిశాస్త్రం" (Urgent Ethnography) ఒక ప్రత్యేకమైన విజ్ఞాన పరిశోధక శాఖగా అవతరించి వుంటుంది. ఇటువంటి ముందుచూపు చర్యలకు "కులగురువులు" అనే ఆయా కులాలకు చెందిన ఆధ్యాత్మిక వేత్తలు ప్రేరణగా నిలబడ్డారు.

అటువంటి ప్రయత్నాలకు మద్దతుగా నిలిచే మరియు విభిన్నమైన సృజనాత్మక సామర్థ్యాలను విలీనం చేసే అవకాశం పరిశోధకులకు అరుదుగా లభిస్తుంది. ఇటువంటి చర్యలకు ప్రత్యేకమైన చొరవ తీసుకొని దానిని సాఫల్యం చేయడానికి ముందుకువచ్చి అత్యంత క్లిష్టమైన సంపాదకత్వ భాద్యతలను తన భుజస్కంధాల మీద వేసుకొన్న డా॥ కొండా శ్రీనివాసులుగారికి, అతనికి వెన్నుదన్నుగా నిలచిన డా॥ అవధానం ఉమామహేశ్వరశాస్త్రి, డా॥బద్దేల రామచంద్రారెడ్డి మరియు డా॥ దామరాజు సూర్యకుమార్ గార్లకు ప్రత్యేకమైన అభినందనలు. వీరందరు మేదరికుల గురువుతో సంభాషించి, ఈ మేదరిపురాణం పుస్తక రూపంలో రావడానికి సహాయపడ్డారు. ఈ ప్రయత్నంలో తమ సహాయ సహకారాలు అందించిన డా॥ ఆకుల కుమారస్వామి మరియు శ్రీ తీగల శ్రీనివాస్‌లకు ధన్యవాదాలు. సెంటర్ ఫర్ స్టడీ ఆఫ్ డెవలెపింగ్ సొసైటీస్ (CSDS) న్యూఢిల్లీ వారు ఈ మేదర పురాణం పుస్తకప్రచురణకు ధన సహాయాన్ని అందజేశారు.

ప్రియదర్శిని విజయశ్రీ
Priyadarsini Vijaisrii
Centre for the Study of Developing Societies, Delhi

# వీరశైవం

- కొండా శ్రీనివాసులు

శివాజ్ఞననుసరించి యుగయుగాలలో శివాచార్యులుద్భవించి వీరశైవమత ప్రచారం చేశారని శైవాగమాలు తెలుపుతున్నాయి. పరమశివుని పంచముఖాలైన సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన్యములనుండి వరుసగా రేణుక, దారుక, ఘంటాకర్ణ, ధేను(శంఖ) కర్ణ, విశ్వకర్ణలను పంచప్రమధులు ఉద్భవించి నాలుగుయుగాలలో వీరశైవమత వ్యాప్తి చేశారు. వారే జగత్ప్రసిద్ధిగాంచిన పంచాచార్యులైనారు. పరమశివుడీ పంచాచార్యులను విష్ణు, బ్రహ్మేంద్రాది దేవతలకు, లక్ష్మీ, సరస్వతీ మున్నగు శక్తులకు, మునులందరికిని లింగధారణజేసి భూలోకంలో లింగముఖముల అవతరించి పంచపీఠాలను స్థాపించి వీరశైవ ధర్మాన్ని వ్యాపింపచేయమని ఆదేశించినట్లు శైవాగమాలు పేర్కొంటున్నాయి.

శివుని యొక్క జ్ఞానమే నందియైనది. వైరాగ్యమే భృంగియైనది. ప్రతాపమే వీరభద్రుడాయెను. సద్ధర్మమే వృషభుడు. కీర్తియే స్కంధుడాయెను. ఈ ఐదుగురు ఈశ్వరస్వరూపులు. నంది, భృంగి, వీరభద్ర, వృషభ, స్కంధ అను ఈ ఐదుగురే గోత్రాధికారులు. వీరి గోత్రోద్భవులే పంచాచార్యులు. అనగా రేణుక, దారుక, శంఖుకర్ణ, ధేనుకర్ణ, విశ్వకర్ణ అను పంచాచార్యులు ఈపంచగోత్రీయులనుండే ఉద్భవించారు. ఈపంచాచార్యులు వేరువేరు యుగాలలో వేరువేరు పేర్లతో ప్రసిద్ధి చెందారు. కృతయుగంలో ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర, పంచాక్షరులని, త్రేతాయుగంలో ఏకముఖ, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖులని, ద్వాపరయుగంలో రేణుక, దారుక, ఘంటాకర్ణ, ధేనుకర్ణ, విశ్వకర్ణులని, కలియుగంలో రేవణారాధ్య, మరుళారాధ్య, ఏకోరామారాధ్య, పండితారాధ్య, విశ్వారాధ్యులని పంచాచార్యుల పేర్లు. పరమేశ్వరుడు సృష్టిని ప్రారంభించినపుడు పంచాచార్యులను, పంచవక్త్ర గణాధీశ్వరులను రూపొందించాడని సుప్రభేదాగమమున వ్రాయబడింది. వీరే వీరశైవాన్ని స్థాపించి లింగధారణ, షట్స్థల, అష్టావరణ, పంచాచారాలను ప్రచారం చేసారు.

# వీరశైవ లక్షణాలు - వీరశైవుడు

శివుని భోదించు మతమే శైవం. ఆ మతాన్ని ఆచరించువారే శైవులు. ఈశైవులలో శివవ్రతాన్ని దీక్షా పూర్వకంగా ఆచరించువారే వీరశైవులు. వీరవ్రతంగా ఆచరించబడిన మతమే వీరశైవమనబడుచున్నది. ఇదియే సర్వోత్కృష్టమైన మతం.

శివుడు నిరాకారమూర్తి. అందువలన మోక్షప్రాప్తి కోసం సాకార వస్తువులందే నిరాకారమూర్తిని భావించి శివలింగరూపమున పూజిస్తారు. శివలింగాన్ని ఎల్లప్పుడు ధరిస్తారు. శివదీక్షయే అతని సంస్కారం లింగార్చన, అష్టావరణ, పంచాచారాల నియమిత ధర్మాచరణాలు. షట్ స్థలములే షడంగ యోగం, భక్తి జ్ఞాన వైరాగ్యాలే సాధనమార్గాలు. ఇదియే శివవ్రతం. ఈ వ్రతాన్ని ఆజన్మాంతం పాటించుటే వీరశైవుని లక్షణం.

సామాన్య శైవంలో కొన్ని శాఖలున్నాయి. అవి పాశుపతం, కాలాముఖం, కాపాలికం మొదలైనవి. ఈశైవసంప్రదాయానుయాయులు వర్ణాశ్రమ భేదాలను విడనాడినవారు కాదు. బ్రహ్మప్రణవ, పంచాక్షరీ, ప్రాసాదాది మంత్రాలు, పశు, పతి, పాశాది వస్తువ్యవహారం, భస్మత్రిపుండ్రధారణ, లింగార్చన, రుద్రాక్ష ధారణాది ధర్మాలు పాశుపతులకు ఉన్నాయని శ్రీకరభాష్యం వలన తెలుస్తుంది.

వాతులాగమమునందు మరల ఆచారభేదాలవలన శైవం నాలుగు విధాలని తెలుపుతూవుంది.

**శైవం చతుర్విధం జ్ఞేయం సమాసా చ్ఛృణు షణ్ముఖ**
**సామాన్య మిశ్రకం చైవ శుద్ధం వీరం యథాక్రమం**

సామాన్య, మిశ్ర, శుద్ధ, వీర అని శైవం నాలుగు విధాలు.

సామాన్య శైవుడు లింగమునెప్పుడు దర్శించునో అప్పుడే పూజించును. అనగా లింగము లభించినపుడే ప్రదక్షిణం, నమస్కారం, దర్శనంకావించును. నియమ ప్రకారం పూజించుట, లింగాన్ని ధరించుట అతని నియమంకాదని తెలుస్తుంది. భస్మధారణం అతని ప్రాముఖ్యం. ఎల్లప్పుడు భస్మం ధరించి తత్ప్రభావముననే శుద్ధుడగును. అనగా ఇతడు శివకీర్తన, శివవచన, శివభక్తులందు ప్రీతిగలవాడైనను శివార్చనయందు మాత్రం నియమం లేనివాడని అర్థం.

శివ, విష్ణు, శక్తి, కుమార, గణపతి, సూర్య మొదలగు అఖిల దేవతలను పూజించు వాడే మిశ్రశైవుడు. ఇట్టి మిశ్రశైవుడు శివుడు సర్వోత్తముడని తెలిసి

శివధర్మాలను అన్యధర్మాలను సహా ఆచరించును. సమస్త దేవతపట్ల సమభక్తి గలిగినవాడైనందున సమస్త దేవతలు శివలింగమునందు కలరని భావించి లింగాన్ని పూజించుచుండును. కనుక అతడు మిశ్రశైవుడనబడును.

శివుని ఒక్కనినే దేవుడుగా భావించి మిగిలిన దేవతలను అతని భక్తులు, అతనితో జన్మించిన వారలని తెలిసి శివునినే పూజిస్తారు కనుక వారు శుద్ధశైవులనబడుదురు. వారి మతమే శుద్ధశైవమనబడును. వీరాగమం ప్రకారం శుద్ధ శైవులే శివద్విజులనబడుదురు. వీరే ఆదిశైవులు. కౌశిక, కశ్యప, భారద్వాజ, అత్రి, గౌతమ అను పంచ ఋషులే పంచవక్త్రములనుండి దీక్ష పొందారు. మంత్రయంత్ర క్రియలు చేయుట, ముద్రలు, న్యాసములు చేయుట, ఆవాహనం చేయుట, బహు విధూప చారాలతో శివలింగాన్ని సింహాసనమునందు పూజించుట, ఇట్టి అచారాలు కలవాడు శుద్ధశైవుడు. ఇతడు లింగాన్ని కరస్థలమునందు పూజింపడు; అంతేకాక శుద్ధశైవుడైన శివద్విజుడు స్వార్థం కొరకు సాలగ్రామ లింగాన్ని పూజించును. పరార్థం కొరకు గ్రామ్యలింగాలను పూజించును.

ఈ అనంత విశ్వమునందంతటను శివుడొక్కడే అను వీరవ్రతం కలిగినందునను, శివునితో ఆత్మకు నికట సంబంధం గలిగించుకొన్నందునను, జీవత్వాన్ని శివునికర్పించి శివ జీవైక్యయుక్తుడైనందునను, వీరతంత్రాలననుసరించిన ఆచారము కలిగినందునను, ఈమతం వీరశైవమనబడింది. ఇదియే శైవమతాలలో ఉత్కృష్టమైంది. ఎవడు శివదీక్షా పూర్వకమైన గురుదత్త లింగాన్ని తల, మెడ, రెట్ట, పొట్ట, ఎద, చెయ్యి వీటియందు యేదొ ఒక స్థలమునందు ధరించి త్రికాలాలలో హస్తపీఠమునందు పూజించుచు, శివపాదోదుక, శివప్రసాదాలను సేవించుచు, లింగలోప, వ్రతలోపములందు ప్రాణత్యాగమే ప్రాయచిత్తముగనెంచి శివైక్యుడగువాడే వీరశైవుడనబడును. అందువలననే ఈతని వ్రతమును వీరవ్రతమనబడును.

## వీరశైవుని సామాన్య ధర్మాలు

త్రికాల భస్మస్నానము, లింగార్చన, ఈశ్వరచింతన, సర్వభూత దయాళుత్వము. సత్యము, సంతోషము, ఆస్తికత్వము, అహింస, శ్రద్ధ, శాస్త్రాధ్యయనం, శివయోగం, సదా పంచాక్షరీజపం, శివశాస్త్ర వ్యాఖ్యానము, శివకథా శ్రవణం, తపస్సు, క్షమ మొదలగునవి అఖండ శివభక్తి కలిగిన ప్రతిశైవుని సామాన్య ధర్మాలు. అనగా

వీరశైవుడు కూడా శైవుడైనందున అతనికి సామాన్య ధర్మాలు మరియు విశేషధర్మాలు కూడకలవు. వీరశైవంలో మతపరమైన బాధ్యతలు, అధికారాలు స్త్రీ పురుషులిరువురికి ఎట్టిహెచ్చుతగ్గులు లేక సమానంగా ఉండుట విశేషం.

నిరక్షరాస్యులు, నిమ్నజాతులు ఎక్కువగా క్షుద్ర దైవాలను పూజిస్తూ జంతువులను బలి ఇచ్చేవారు. ప్రతిగ్రామానికి, పట్టణానికి, రహదారికి, నదికి, వాగులకు, చెరువులకు, శ్మశానానికి ప్రత్యేక దేవతలుండేవారు. పాములను, వృక్షాలను, రాళ్ళను, ఇంటిలోని పాత్రలను, చేటలను, జల్లెడలను కూడా ప్రజలు పూజించేవారు. దీనివల్ల నిజమైన మతతత్వం మరుగునపడి ప్రజలు పెడ దారులు పట్టారు. ఆదినుండి అమలులోనున్న చతుర్వర్ణాలు శతాధికవర్ణాలయ్యాయి. అస్పృశ్యతాజాడ్యం సమాజాన్ని పీడిస్తుండేది. వర్ణాలలో న్యూనాధికతా భావాలు ప్రజల మనస్సులను కలుషితం చేశాయి. గుణం కంటే కులం ప్రధానమైంది. స్త్రీ, పురుషులకు సంఘంలో సమాన స్థానం లేకుండెను.

ఈపరిస్థితులు వివేకవంతులను కలవరపెట్టగా వారు వాటిని చక్కబరుచుటకై తీవ్రంగా పాటుపడసాగారు. 12వ శతాబ్దంలో ఉత్తర కర్ణాటకంలో వెలసిన ముగ్గురు మహానుభావులు బౌద్ధ జైన మతాలను ప్రతిఘటించి శైవమత పూర్వ ప్రాశస్త్యాన్ని ఉద్ధరించుటకు కృషిజేసారు. వీరావేశంతో శైవాన్ని పాటించి వ్యాప్తి చేసిన గొప్ప ఉద్యమమిది. వీరశైవ భక్తులకు లింగము, విభూతి, రుద్రాక్షలు ధరించుట ప్రధానలక్షణం. ఇది సర్వమతసారసంగ్రహమని చెప్పవచ్చును. వైదికము యొక్క వర్ణాశ్రమ ధర్మాలను, కర్మకాండను ఖండించింది. జైనబౌద్ధముల సన్యాసమును నిరసించినది. అద్వైతం యొక్క బ్రహ్మజ్ఞానం అనవసరమని భావించింది. సంఘ నిర్మాణంలో వృత్తులపై ఆధారపడి శ్రమించు శూద్రులను, దళితులను చేరదీసింది. వారి ఉద్ధరణకు ప్రయత్నించింది. వారి అభ్యున్నతికి అహర్నిశలు కృషిచేసింది. వీరశైవులు వర్ణాశ్రమధర్మాలు విడచి లింగధారులైన వారందరు ఒకటే కులమని అనెడివారు.

బసవేశ్వరునికి పూర్వమే వీరశైవము ప్రచారంలో ఉన్నది. దాని మూల కారకుడు ఏకాంతరామయ్య అని పండితుల అభిప్రాయం. కాని బసవేశ్వరుడు వీరశైవాన్ని మారిన కాలమాన పరిస్థితులకనుగుణంగా సంస్కరించి తీర్చిదిద్దాడు. వర్ణాశ్రమ ధర్మాలను ఖండించి, యజ్ఞయాగాది క్రతువులను నిరసించి, కర్మలను మరపించు నూతన క్రాంతి పథాన్ని అన్వేషించి భక్తికి ప్రాధాన్యత ఇచ్చాడు. ఇతడు క్రీ.శ. 12వ

శతాబ్దంలో బిజ్జలునికి మంత్రిగా కల్యాణపురంలో ఉన్నాడు. ఇతడు సంఘసంస్కారియై కులభేదాలను పాటింపక లింగధారణ మాత్రమే చాలని వైదిక సంస్కారాలైన ఉపన యనాది సంస్కారాలను త్యజించాడు. ఈబసవేశ్వరుని మతమవలంబించిన వారందరు లింగాయతులని, వారి మతానికి లింగాయత లేదా వీరశైవమని పేరు. వీరశైవం ఆంధ్రదేశంలో ప్రవేశించి రాజుల, ప్రజల ఆదరణ పొందింది. కాకతీయరాజుల కాలంలో వీరశైవం మూడుపూవులు ఆరుకాయలుగా వర్థిల్లింది. అనేక శైవ దేవాలయాలు నిర్మింపబడ్డాయి. శైవ పీఠాలు, మఠాలు రాజుల సహాయ సహకారాలచే ఏర్పడి ప్రజాదరణ పొందాయి. ప్రజలలోని అట్టడుగువర్గాలలో వీరశైవం వ్యాప్తిపొందింది. వీరశైవం విజృంభించిన తర్వాత కొలనుపాకలో ప్రతి కులానికి ఒక మఠం ఏర్పడింది. వీరశైవులు తమ మతాన్ని అభివృద్ధి పరచుకోవడానికి అష్టాదశవర్ణాల వారికి శివాలయాలు ఏర్పరచి ప్రజలనాకర్షించారు.

## మఠాల ప్రాముఖ్యత

పరమశివుని ఆజ్ఞమేరకు పంచాచార్యులు అవతరించి వీరశైవ ధర్మాన్ని స్థాపించి దాని అభివృద్ధికి గాను దేశమంతటా శాఖా మఠాలను నెలకొల్పారు. ఆ మఠాల పరిపాలనకు పట్టాధికారులను నియమించి ఆచరపట్టాధికారుల అధీనంలో ప్రతి గ్రామానికి ఆయా గ్రామాలకు తగినట్లుగా ఒకటిగాని, రెండుగాని, లేదా నాలుగు, ఎనిమిదిగాని అవసరాన్నిబట్టి అంతకంటే ఎక్కువగా మఠాలను స్థాపించి, వాటన్నింటిలో ఒకటి ప్రధానమైనది పెద్దమఠంగాను, మిగిలివన్ని దాని అధీనంలో చిన్న మఠాలుగాను నియమించి ఆయా మఠాలను గృహస్థాశ్రమ మఠాధికారులను లేదా దేశికస్వాములను, కొన్నిచోట్ల దేశికమూర్తులను, వారి అధీనంలో మఠపత్తిగుణారి, గణాచారి, స్థావరశెట్టి అను వర్తందార్లను (వంశ్య పారంపర్యాగతా ధికారులను) నియమించి, వారి సహాయకులుగా దైవపువారిని (గ్రామపెద్దలను యోగ్యులైనవారిని) ఎన్నుకొని భక్తుల లేక మహేశ్వరుల ప్రతి శుభాశుభ కార్యాలను నిర్విఘ్నంగా నిర్వహించబడునట్లుగా, లింగధారణ దీక్షా, వివాహాది కార్యాలలో పంచపీఠాధిపతుల పేరిట పంచకలశాలను స్థాపించి ఆయా కార్యాలు జరుగునటుల సువ్యవస్థను ఏర్పాటు కావించారు. అంతేకాక ఈఅన్నికార్యాలు ఆచారాలు లోపించకుండా, అవకతవకలు జరుగ కుండా జాగ్రత్తలు తీసుకొన్నారు.

మఠం అంటే మతపరమైన విద్యాబోధనకేంద్రం, సన్యాసులు నివసించే

ప్రాంతాలని, దేవాలయాలని అనేక అర్థాలున్నాయి. మఠాలు దేవాలయాలకు అనుబంధంగా ఉంటాయి. దేవాలయాలు ఆధ్యాత్మిక జీవనం గడిపే సద్వర్తనులైన ఆచార్యుల నిలయాలు. వీటికి అనుబంధంగా ఉండే మఠాల్లో ఆచార్యులు విద్యార్థులకు విద్యాబోధన చేస్తుండేవారు. మఠాచార్యులు అన్ని శాస్త్రాల్లో ప్రవీణులుగా ఉండేవారు. 10వ శతాబ్దంలో కాలాముఖ శైవాచార్యులు మఠాలనేర్పరచి ఆధ్యాత్మిక జీవనం గడుపుతూ శిష్యులకు విద్యాబోధన చేస్తుండేవారు. ఎందరో రాజులు కాలాముఖ శైవగురువులను రాజగురువులుగా ఆదరించి పోషించారు. సమాజంలో వీరికి చాలా విలువ, గౌరవం ఉండేది. వీరు చెప్పిందే వేదం. రాజు నుండి బంటు వరకు మఠాచార్యుల ఆజ్ఞలను పాటిస్తూ గౌరవిస్తుండేవారు. సమాజాన్ని శాసించే కేంద్రబిందువుగా మఠాచార్యులుండేవారు, ఈమఠాలన్ని 10వ శతాబ్దం నుండి 13వ శతాబ్దం వరకు ఉచ్ఛదశలో ఉన్నాయి. మఠాలన్ని విద్యా కేంద్రాలుగానే కాకుండా సాంస్కృతిక కేంద్రాలుగా ఉండి ప్రజాసమస్యలను పరిష్కరిస్తూ ఆధ్యాత్మిక జీవనాన్ని అలవాటు చేయటానికి దోహదపడుతుండేవి.

భారతదేశ వీరశైవ పంచపీఠాలలో కొలనుపాక ఒకటి. కొలనుపాకలో కులప్రాతిపదికతో ఏర్పడిన 22 మఠాలున్నాయి. తెలుగురాష్ట్రాలలో ఎక్కడా ఇన్ని కులమఠాలు ఒక్కదగ్గరలేవు. ఇది కొలనుపాకకున్న ప్రత్యేకత. శ్రీశైలంలో 13 మఠాలున్నట్లు శాసనాలు, సాహిత్యాలవలన తెలుస్తున్నది. ఆమఠాలు శైవశాఖలకు సంబంధించినవి కాని కులాలకు చెందినవికావు. కాని కొలనుపాకలో ప్రతి కులానికి ఒక మఠం ఉన్నది. వీరశైవం బాగా వ్యాప్తి చెందాలంటే ప్రతికులంలో ఉన్న వ్యక్తులకు శివదీక్ష ఇప్పించాలి. కులప్రాతిపదికగా మఠాలు ఏర్పరిస్తేగాని అది సాధ్యపడదు. ఆ ఉద్దేశ్యంతోనే కులమఠాలను ఏర్పరచారు. అదీగాక కొలనుపాక వీరశైవ పంచమఠాల్లో ఒకటి. రేవణసిద్ధుని జన్మభూమి. అందుకే ఆప్రత్యేకత ఏర్పడింది. కొలనుపాకలో ఉన్న ప్రతిమఠంలోని ఆలయంలో శివలింగం, నంది తప్ప ఎటువంటి అలంకారాలు లేవు. ప్రతికులంవారు పండుగరోజులలో ముఖ్యంగా శివరాత్రి రోజున తమతమ మఠాలను అలంకరించుకొని పూజలు జరుపుకొంటారు. కులంలో ఏవైనా తగాదాలు వస్తే తమ మఠాలలో కూర్చుని పరిష్కరించుకొంటారు. కొలనుపాకలో 18 కులాలవారికి గురువులున్నారు. మఠాల దగ్గర పండుగ దినాలలో అయా కుల పురాణాలు పఠిస్తుండేవారు. ఆజానపద గాయకులను ప్రతి కులంవారు ఆదరించి

పోషించారు. ప్రతి కులపురాణంలో కేంద్రబిందువు వీరశైవమే. అన్నికులాలకు తమ కులమే మూలమని ప్రతి కులపురాణాల ఇతివృత్తాలలో కనిపిస్తుంది. సోమేశ్వరాలయ సింహద్వారం వద్ద 'ప్రమాణమంటపం' ఉంది. తగాదాలలో ప్రమాణాలు చేయదలిస్తే ఈ మంటపం వద్దకు వచ్చి ప్రమాణం చేస్తుంటారు. ఈమంటపంలో అబద్ధపు ప్రమాణం చేస్తె అరిష్టం కలుతుందని ప్రజల విశ్వాసం.

## కొలనుపాకలోని వీరశైవ మఠాలు

| మఠం | పురాణం | గురువు |
|---|---|---|
| 1. వైశ్యమఠం | నగరేశ్వరపురాణం | నీలకంఠయ్య |
| 2. గాండ్లమఠం | తిలకేశ్వరపురాణం | రాజయ్య |
| 3. కాపులమఠం | - | గురువయ్య |
| 4. గొల్లమఠం | రేవణసిద్ధేశ్వరపురాణం | నాగయ్య |
| 5. కుర్మమఠం | రేవణసిద్ధేశ్వరపురాణం | సిద్ధయ్య |
| 6. గౌండ్లమఠం | గౌడపురాణం | నాగయ్య |
| 7. మేరమఠం | - | సోమయ్య |
| 8. పద్మశాలిమఠం | మార్కండేయపురాణం | సిద్ధయ్య |
| 9. మేదరిమఠం | - | రాజయ్య |
| 10. జాంద్రమఠం | గుడిదగ్గర చెలకలో ఉంది. (దసల పంచలు నేసేవారు) | సిద్ధయ్య |
| 11. చాకలిమఠం | మడివేలుమాచయ్యపురాణం | నాగయ్య |
| 12. మంగలిమఠం | మడివేలుమాచయ్యపురాణం | నీలకంఠయ్య |
| 13. కుమ్మరిమఠం | కుమ్మరిగుండయ్యపురాణం | శంకరయ్య |
| 14. వడ్డెరమఠం | నక్కనారాయణగుడి జైనమందిరందగ్గరుంది | సోమయ్య |
| 15. మహమ్మాయిమఠం | (పంచదాయిమఠం) | |
| 16. మాలమఠం | నులకచందయ్యపురాణం | సాంబయ్య |
| 17. మాదిగమఠం | జాంబపురాణం | మిర్యాలమల్లయ్య |
| 18. చిప్పమఠం | (నఖాషిపనివారు) | |
| 19. సంగరిమఠం | - | సాంబయ్య |

| | | |
|---|---|---|
| 20. పెరికమఠం | మల్హారచరిత్ర | నవ శివయ్య |
| 21. శంబరిమఠం | - | వీరయ్య |
| 22. తెనుగుమఠం | (ముదిరాజ్) | |

(ఈజాబితా శ్రీవిరువంటి గోపాలకృష్ణ గారి కొలనుపాక చరిత్ర-శాసనాలు, కొలనుపాక దేవాలయాలు అనే పుస్తకాలనుండి గ్రహించబడినది. అప్పుడున్న మఠాల గురువులు ప్రస్తుతము మారి వుండవచ్చు గ్రహించప్రార్థన - సంపాదకుడు)

# మేదరిమఠం వర్షాశనపు దానపత్రము

- పరిష్కర్త
కొండా శ్రీనివాసులు

ఈ దానపత్రము మేదరిమఠం గురువు శ్రీనాగేంద్రయ్యగారివద్ద కల చుట్టగా చుట్టబడిన కాగితపు వ్రాతప్రతి ప్రకారము వ్రాయబడింది. భాష తెలుగు. వ్రాతపతి సమగ్రంగా ఉన్నది. లేఖనదోషాలున్నాయి. దానపత్రికను వ్రాసిఇచ్చిన సంవత్సరం శాలివాహన శకం 1654 ప్రభవనామ సంవత్సరం ( క్రీ.శ. 1732). వర్షాశనము అనగా రాజులు, సామాన్యులు మొదలగువారు పండితులకు, మఠాలకు సంవత్సరానికొకసారి ఇచ్చే సంవత్సర గ్రాస ద్రవ్యము. ఈదానపత్రిక - దక్షిణ కాశీగా ప్రసిద్ధిపొందిన కొలనుపాక లోని మేదరిమఠం - మేదరి కేతమశెట్టి భక్తులు శ్రీకేతేశ్వరమఠం (మేదరిమఠం) బసవయ్య స్వాములవారికి వ్రాసిఇచ్చిన వర్షాశనపు దానపత్రిక. ఇందులో సృష్టి ప్రారంభం, 14 లోకాలు, అప్సరసల పేర్లు, అష్టదిక్పాలకులు, సప్త ద్వీపాలు, సప్తసాగరాలు, సప్త పర్వతాలు, 14 మనువులు, పుణ్యనదులు, దివ్యక్షేత్రాలు, ఛప్పన్న దేశాలు, అష్టాదశ పురాణాలు, అరవైనాలుగు కళలు, 32 రాగాలు, సప్తరుషులు, పంచకన్యలు, మహామునుల వివరాలు, మేదరిభక్తులు మేదరి మఠానికి ఇవ్వవలసిన వర్షాశనపు వివరాలు, 56 దేశాలలో మేదరభక్తులున్న గ్రామాలు, పట్టణాల జాబితా, దానపత్రికను ఉల్లంఘించిన వారికి విధించే శిక్ష, దానాన్ని పాలించేవారికి కలిగే పుణ్యం గురించి వివరించే వ్యాసమహర్షి శ్లోకాలు, మేదరివాళ్ళు వీరముష్టులకు ఇవ్వవలసిన మర్యాదలు మొదలగు వివరాలు కలవు. ప్రారంభమున శైవ భక్తిని, కులవృత్తిని సూచించే మేదరివాండ్ల చిత్ర పటం కలదు. ఈ కాగితపు వ్రాతప్రతి కొలతలు : 30.5 × 495 సె.మీ.

## దానపత్రము

### శ్రీ శివాయనమః

శ్రీమదనంత వేద వేదాంత ప్రతిపాదిత దహరాకాశ సూక్ష్మరంధ్రాంతర్గత పరమ చిత్కళావలోక అనుపమ అవ్యయ ఆది మధ్యాంత రహిత - నిర్మల చిత్తంబురుహో శ్రీమద్వేదాగమ ముఖ్యంబైన అఖండ వీరమహేశ్వరాచార సంపన్న గురు లింగ జంగమ పాదతీర్థ ప్రసాదసేవితులైన అష్టాదశవర్ణ (అష్టావరణ) పంచాచార స్థాపనాచార్యులైన

యేకలింగనిష్ఠ పారాయణులైన యమ నియమ మానసప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగయోగనిరతులైన శ్రీమద్వీరమహేశ్వరాచార సంపన్న సత్యజ్ఞానానంద బ్రహ్మాత్మక అష్టావర్ణ (అష్టావరణ) పంచాచార స్థాపనాచార అరుణోదయ తమసోదయ పవనోదయ ఉదయ మధ్యాహ్న సాయంకాలాది షట్కాలాది ఇష్టలింగార్చన పూజ కలావర్య నియమానస నిరంతులైన శ్రీనందినాథ శ్రీభృంగినాథ వీరభద్రదేవర ముఖ్యంబైన శ్రీరుద్రగణ శ్రీప్రమథగణ పరమేష్టితంబైన(పరివేష్టితంబైన) శ్రీప్రభుదేవర ప్రతిబింబ స్వరూపులగు శ్రీదక్షిణకాశీ కొలనుపాక గురుసింహాసన శ్రీగురురేవణ సిద్ధేశ్వరులగు సిద్ధేశ్వర యేకోరామయ్య పండితారాధ్య పంచమఠ పంచగుహా మహామాంతు ముఖ్యంబైన శ్రీసోమేశ్వరస్వామి సన్నిధియందు శ్రీకేతేశ్వరమఠం ప్రతిమఠం బసవయ్య స్వాములవారికి నిత్యంమఠములో ధూప దీప నైవేద్య దక్షిణ తాంబూల నిత్య జంగమార్చన గురుపూజ ప్రవర్ధన కాగలందుకు మేదర కేతమశెట్టి భక్తులు వ్రాసి ఇచ్చిన ధర్మ వరుశాచనపు (వర్షాశనపు) దానపత్రిక నమః

స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు 1654- రాజ విజయ భవతు - అశ్మినబ్దే (అస్మిన్నబబ్దే) ప్రవర్తమానే చాంద్రమానే ప్రభవనామ సంవత్సరే ఉత్తరాయణ - వసంతరుతువౌ (వసంతఋతౌ) వైశాఖమాసే శుక్లపక్షే ద్వితీయ (ద్వితీయాయాం) భానువాసరే శుభదివసే శుభనక్షత్రే శుభయోగే శుభకరణే శుభముహూర్తే స్వస్తి సమస్త విస్తారక శ్రీపరమేశ్వర శక్తి ప్రభావ విక్రాంత ప్రరాక్రమ విక్రమాలంకార రూప క్రియా కళాశోభిత - అఖిలాండకోటి - బ్రంహ్మాండ నాయక వేదవేదాంత పురాణ పురుషోత్తమ శ్రీపరమేశ్వర ప్రియసఖుండైన శ్రీఆదినారాయణుని నాభికమలమందు బ్రహ్మ ఉద్భవించెను - బ్రహ్మదేవుని సృష్టి నిర్మాణంబెట్లుండెనంటేను - యిట్లు కొలువై కూర్చున్న సభాపతి లక్షణంబులు - నిఖిల జగదుద్భవ స్థితి లయ హేతుర్భూతుడయిన బ్రహ్మదేవుని వామ దక్షణ భుజములనుద్భవించిన సూర్య సోమవంశ పంచాచారానుచారులైన భూపతి సింహాసనాసీనుడైన సౌమ్య సాంబ భరతోక్ష శక రాష్ట్ర దుర్గంబున్ను సప్తాంగంబులు గలిగి సామ దాన భేద దండ మాయాపేక్షణ యింద్రజాల మహేంద్రజాలంబులనియెడు సప్తవ్యసనంబులు పరిహరించి భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోక అతల వితల సుతల తలాతల రసాతల మహాతల పాతాళ లోకంబులనియెడు అధోలోకంబులు యేడున్నూ కూడా చతుర్ధశ భువనంబులు నిర్మించి వస్తు బలైన సంపాద్యంబు యెట్టిదంటేను కల్పవృక్ష కామధేనువు

చింతామణి శ్వేతగజంబులు శ్వేతాశ్వంబులు శ్వేత ఛత్రంబులును దేవేంద్రాది బృందారక సంఘంబులున్ను ॥ రంభా ఊర్వశి మేనక తిలోత్తమ ఘృతాచి మొదలయిన అప్సరస స్త్రీ నాట్య సమూహంబులుంన్ను॥ గరుడ గంధర్వ కిన్నెర కింపురుష విద్యాధరులుంన్ను ॥ యింద్ర అగ్ని యమ నైఋతి వరుణ వాయువ్య కుబేర ఈశానాది అష్టదిక్పాలకులుంన్నూ॥ అష్టగజంబులుంన్నూ - జంబూద్వీప ప్లక్షద్వీప శాల్మలిద్వీప కుశద్వీప క్రౌంచద్వీప శాకద్వీప పుష్కర ద్వీపంబులనియెదు సప్తద్వీపంబులుగలిగి - లవణ ఇక్షు సుర సర్పి దధి క్షీర శుద్ధోదకంబులనియెదు సప్తసాగరంబులు గలిగి - హిమవంత నిషాద వింధ్యాచల మలయాచల పర్యార్థ గంధమాధన హేమకూట పర్వతంబులని యేడు నిర్మించి స్వాయంభు స్వారొచిష ఉత్తమ తామస రైవత చాక్షు వైవస్వత సుర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి విష్ణుసావర్ణి రుద్రసావర్ణి దేవసావర్ణి ఇంద్రసావర్ణులైన పదునాలుగు మనువులనియెదు యేర్పరచి - భాగీరథి - భోగావతి - జాంహ్నవి - గోదావరి తుంగభద్ర వేత్రావతి - కృష్ణ యమున నర్మద । సరయు । తాంబురపర్ణి (తామ్రపర్ణి)। కావేరి । తిరుపతి (తపతి?)। లోకపావని - అనంతముఖి - సింధునది - సరస్వతి - మన్సతి - వేళుకా - గండకి - గౌతమి - గోమతి - భవనాశి పినాకిని - అవంతి - ద్వారవతి - శాంభవి - శోముఖి (సువర్ణముఖి?) కావేరి మొదలయిన పుణ్య నదులున్ను - కాశీ - కేదారం - శ్రీశైలం - గోకర్ణం - కుంభకోణం - అనంతశయనం - సుబ్రహ్మణ్యం - వుడవి (ఉడిపి) - పాండ్రంగి - కాళహస్తి - కాళేశ్వరం మొదలయిన దివ్యక్షేత్రంబులుంన్ను - శ్రీరంగం - కంచి - తిరుపతి - ధర్మపురి - జగన్నాధము - శ్రీ కూర్మము మొదలయిన నూటయెనిమిది తిరుపతులుంన్నూ - అంగ -వంగ - కళింగ - ఆంధ్ర - విధర్భ - బర్బర - బంగాళ - నేపాళ పాంచాల లాట - గాంధార - కుంతల - కోసల - కంనోజి - వత్స - సింధు - బాహ్లిక - క్షారాట - శూరసేన - సౌరాష్ట - మాళవ - సరయూ - అవంతి - కరహాట - గూర్జర - కాంభోజ - చోళ - కొంకణ - పారశీక । మలయాల । తెంకణ । కర్నాట - సవురణ - క్షాత్ర యవన - పుళింద - పౌండ్ర - దశార్ణవ - నిషద - ద్రవిళ - మాగధ - సోమవర - సవురవ - దెహాయ । కాశ్మీర - సుదేష్ట- మత్స్య - కేరళ - త్రిగర్త - కేకయ - తురుష్క-వరటా(?) - కిరాత - సింధ్యాది - ఛప్పన్న దేశంబులుంన్నూ గలిగి మరి విశేషదేశంబులుంన్నూ యిందుకు మొదటి ద్వీపంబు - పంచాశతకోటి యోజన విస్తీర్ణంబు -మొదలయిన దేశంబులుంన్నూ - సకలగుణ విశేషంబులుగల పురుషులుంన్నూ గంధ మాల్యా భరణంబులకు కారణంబడిన

– ఏకాదశ రుద్రులుంన్నూ – ద్వాదశాదిత్యులుంన్నూ – నవబ్రంహ్మలుంన్నూ – వచనసంప్రోక్తమనబడు – రుగ్యజుస్సామా అధర్యణంబులనియెడు నాల్గువేదంబులుంన్నూ – తర్క– మీమాంసా శబ్ద శాస్త్రంలాదిగాగల – ఆరు శాస్త్రంబులుంన్నూ – స్కాంధపురాణము వాయుపురాణ పద్మపురాణ – బ్రంహ్మపురాణంబులాదిగాగల అష్టాదశపురాణంబులునూ – అక్షర జ్యోతిష – అలంకార– గణిత లక్షణ –మృదువాద్య – భ్రమణ – భరత పౌరాణిక – గంధర్వ – సర్పవైద్య – రాచవైద్య – శాస్త్రవిధారణ – అశ్వలక్షణ – మోహన–విద్యాకర్త – అశ్వవైద్య – సంఘటికాకణ్య – యోగశాస్త్రం – యింద్రజాలం – బేతాళమంత్ర – శ్రీలక్షణ – మంత్రసిద్ధి – రసవాదం – గజవైద్య – విషవాద – ఆగమ – యితిహాస – అవధానభ్యాస – మీమాంస – నీతిశాస్త్రం – గజకర్ణ – గోకర్ణ – క(ఖ)డ్గస్తంభన – ఖేచరిగమన – యిష్టుంటికశుద్ధి – వాస్తు శాస్త్ర – కన్యావధ్నా – అదృశ్యకరణి – శాల్మరి విద్య – విద్వేశణ – మితాహళ – భూషణోత్కర్ష – దాతువాద – పరకాయ ప్రవేశ – పురుష లక్షణ – మోహన స్తంభన – మాయాస్తంభన –వుచ్చాటన – ఆవేష –రథోరోహణ – ముద్రరక్ష – ధనుర్విద్య – శిభికారోహణ తృణవాద – వుత్కర్షణ – అవతుస్తంభణ – మహేంద్ర జాల – మురవాదన – శాస్త్ర ప్రధానంబులనియెడి అరువైనాలుగు 64 విద్యలున్నూ – పుంన్నాగ పూరి కాంభోజ – ధంన్నాసరి – నాట – కన్నెడ గవుళ – హాయిరి – కల్యాణి – మేఘరంజని – మోహన – భూపాళ – మృగరంజని – భిగడా – శంకరాభరణం – వరాళి – భైరవి – ఆనందభైరవి – కాఫి – బిలహరి – శ్రీగుప్తి – సావేరి – ఘంటారవా – వుశిని – ముఖారి – బిలహరి – రామకళి – గుండావర్ణ – గానవిద్యారాగపరిశీలనంబులును – భరతనాట్య అలంకార – విశెక్షణంబులనె ముప్పదిరెండు రాగంబులుంన్నూ – అబ్దంబులుంన్నూ – ఆయనంబులుంన్నూ – మాసంబులుంన్నూ – వారంబులుంన్నూ – తిధులుంన్నూ – నక్షత్రంబులుంన్నూ – సూర్యుడు – చంద్రుడు – అంగారకుడు – బుధుడు – బృహస్పతి – శుక్రుడు – శనేశ్వరుడు – రాహుకేతులనియెడి నవగ్రహంబులును – కశ్యప – అత్రి – భరద్వాజ – విశ్వామిత్ర – గౌతమ– వశిష్ఠ – జమదగ్నులనెడి సప్తరుషులుంన్ను – అహల్య – ద్రౌపతి – కుంతి – తార – మండోదరి మొదలగు పరమ పంచ కన్యలుంన్ను – నారద – ఆంగిరస, – వాల్మీకి – పులస్త్య – గార్గేయ – కపిల – కౌశిక – బలాహక – కణ్యక – భృగు – మైత్రావరుణ – కౌండిన్య – వునాయన – రుష్యశృంగ – శరభంగ – శాండిల్య – అజోర్ప – అగస్త్య – శుక – శౌనక – దూర్వాస – మంద్రపాల –

మార్కండేయాది మహామునులుంన్ను - మరిన్ని - వుదకంబులు - తొమ్మిది లక్షల జీవరాశులుంన్ను - స్తావరంబులు యిరువయిలక్షలున్నూ - క్రిమి జంతు సంఘంబులుంన్నూ - పదకొండు లక్షలుంన్నూ - పది లక్షల జాతుల పక్షులుంన్నూ మృగంబులు ముప్పయి లక్షలుంన్నూ - మనుష్యులు నాల్గులక్షలుంన్నూ - యివి పృద్విమీద నిర్మాణము చాయగలందుకు అతి ప్రియుండైన ఆదినారాయణనాభి కమలమందు వుద్భవించిన బ్రంహ్మాదేవుంన్ని కర్తను చేసిన ప్రభుస్వామి ప్రతిబింబ స్వరూపంబైన శ్రీగురు రేవణ సిద్దేశ్వరుని శిష్య సాంప్రదాయకులయిన కల్యాణపుర వీరక్షత్రజనితులగు - స్వస్తి సమస్త - సమయ ద్రోవాణీ గండ శరణాగత - వజ్రపంజర మేదర కేతమశెట్టి బిరుదుకె వెలసిన వనదేవి వరప్రసాదకులయిన - వల్లెంబున కేతేశ్వర దేవర దివ్య శ్రీపాద పద్మారాధకులయిన - నగరమునుండి - దండ్డనాయకులయిన శ్రీసదాశివ వామపాద జనితులయిన సత్యజ్ఞాన శీల గుణ సంపన్నులయిన శైవాగమ శాస్త్ర సంపన్నులయిన - పురాతన - సనాతన నూతన - ప్రమధగణాది శివగణాది సింధు దాసోహ శివనిరంతర శ్రీవిభూతి రుద్రాక్ష మాలిక అలంకార శ్రీపంచాక్షరి మంత్ర పఠన నిరంతర జ్ఞాన సంధాన సాలోక్య సోమాప్య సామీప్య సాయుధ్య శతృవిధానందభరిత నడనుడి భావ - వీరప్రతాప సంపన్నులయిన - మహామహిమోన్నత సంపన్నులయిన - ఆకల్పిత భాగ్య సంపన్నులయిన - అంన్యజన ధనవర్జిత - అన్యకాంతాసహోదర - పరద్రవ్య తృణీకృతులయిన - సంతత వుద్యోగ వ్యాపారీణులయిన - అశ్వగజ రథాందోలికా వస్తువాహనాది ప్రతిష్టకులయిన - కళ్యాణ రూపక భాజాభజంత్రీ - సకల సన్నాహ యిష్టలింగార్చన పూజా దురంధరులైన త్రికాల అనుష్టాన జపధ్యానరూడులయిన - త్రికాల జంగమ పాద తీర్ధ ప్రసాద సేవితులయిన - శ్రీకేదారేశ్వర ప్రతిజంగమ వ్రత వుద్ధారకులయిన - బలిజరకపు శెట్టి మేదిని కంఠ కటాక్షపు బిరుదుకే వెలసిన - మేదర కేతమశెట్టి - గౌరీశ్వరశెట్టి - సౌమ్యశెట్టి సమయాచారపుశెట్టి - శెట్టి సాంప్రదాయకులయిన - శ్రీపార్వతీ వల్లభ శ్రీపాదపద్మారాధకులయిన - శ్రీభూ మోళిగయ్యాము సిడినవుడయ - సాక్షిగాను - కైలాసనివాసుండైన - కేతన భక్తుండు తిరువళీ - ఆళువారు - ఆశ్రీసంపన్నులుంన్నూ - అన్వయ ప్రవర్తనులుంన్నూ - అణుశ్రణువు అరయనేరని వారలుంన్నూ - అష్టభోగ దురంధరులుంన్నూ - అధిక సంపన్నులుంన్నూ - అన్నదాన వినోదులుంన్నూ - కంచి శాసన ప్రశస్త శ్రీమేదర కేతమశెట్టి శ్రీకేతేశ్వర దేవర దివ్య శ్రీపాదపద్మారాధకులుంన్నూ - శ్రీమహామేరు సమానధీరులగు మేదర భక్తులు వ్రాయించి యిచ్చిన వర్షార్చన దాన

పత్రికె – ప్రతి సంవత్సరము – ప్రతి గ్రామాల వారు యింటి వక్కింటికి – రేపు పిడికెడె బియ్యము, మాపు పిడికెడు – బియ్యము – దమ్మిడి గవ్వలు – వక్క ౧శిబ్బి – యిదిగాకను యింటికి వక్కింటికి – యాదాదికి –౧రూపాయి చొప్పున – యిత్తును – యిదిగాకను – పెండ్లికి పినుమనివారు –పాగా శెల్లా రూపాయి – పిల్లవారు శెల్లారూపాయి – అయిదు మానికల బియ్యము – అయిదు సనుగాండ్ల నేబులు – మల్లంమ్మకు చేసుకుంటే – మూడురూపాయాలు – ౧వక్క శెల్లా – అయిదు మానుకల బియ్యము – ప్రధానానికి – పావులా వీసము నేబులు – అయిదు తవ్వల బియ్యము – పావుశేరు పోకలు – పినదేవరకు చేసుకుంటే – అర్ధవీసము నేబులు మానెడు సోలెడు బియ్యము – వీరభద్ర ఆరాధనకు – రెండు రూపాయలా పావలా చొప్పున – సోమవారపు వుద్యాపనకు – రూపాయి – ఆచారము – అనాచారము – భూరి – చినాలి – అయ్యగారి – ముఖాంతరము తీర్పుటము చేసుకోగలందుకు – యాబై ఆరుదేశాల వారు – యిందులో వున్న ప్రకారంగా నడిచే అట్లుగాను – రాజులకు యరుక చేసి – సుల్తాన్ అబ్దుల్లా తానేశ కుతు పురుష కల్మరుహూ – రూపాత్మ – పరమాత్మ – అలంగీరు పాదుషా – ఖిల్లా మహమ్మదునగరు – షహరు హాయదరాబాదు – వా– కైలాసకోట – వ॥ అవురంగబాదు – సతార – వ॥ దవుల్తాబాదు – వ– దోరూరు – వా–నాందేడు – వ ॥ బీదరు కోట – వా– బాల్కి వా–చిటుగుప్పి– వా–నడికుడి – వా– కొండూరు వా–ఆలూరు – వా–పట్లూరు – వా–కోవూరు – వా–తాంద్రా వా– –వా బుతువురము – వా పరువతాపురము – వా కలుబరిగె – వా కొయ్యల కొండ – వా దంత్తాలపల్లె – వా ఊటుకూరు – వా సుగురు – వా గణాపురము – వా కందూరు – వా తాటికొండ – వా ఝుటాప్రోలు – వా గట్టు – వా గద్వాల – వా కందునూరు – వా కడప – వా బల్లారి – వా సురాపురం – వా యాదగిరి – వా మాలిగామం – వా తులిజాపురం– వా షోలాపురము–వా పూనా – వా మంమ్మాయి – వా కందారం – వావుద్దిగిరి – వా జాంబ్బా– నా జలుకోట – వా గంగాఖేడు – వా హత్రావతి – వా గజవెల్లి – వా తిగుల్లా – వా యంగట్టి–వా బాలుకొండ – వా ఆదేరం– వా యిందూరు – వా బోధనం – వా కోటగిరి – వా దురికి – వా భాసువాడ – వా కాసలకోట – నా కొడిచెర్ల నా ఆనేగాం – నా జూకల్లు – వా కరినెకల్లు వా దేగులురు – వా తోగామా – వా నాందేడు – వా కసుకుర్తి – వా కలంబా – వా హురకేడీ – వా పిట్లెం – వా మయసా – వా ముదేడం – వా వోతేయి – వా తేంబరేణి – వా నిర్మల – వా మామెడా – వా కోసువేటు – వా కోదూరు –వా చింత్తల –వా

గుజా – వా తురకలచాందా – వా పారంతోర్ – వా కొయ్యడ – వా భద్ – వా వానై – వా భాంజీ – వా వరోడా – వా భీగామ – వా చింమ్మూరు – వా చాందా – వా నాగాపురం – వా ఝురిభార్ – వా కంద్దారం – వా తూగాం – వా హవేలి – వా సరసుగావు – వా మాద్గోవు – వా యాదూ – వా శేలు – వా ఆంజి – వా నాచానవు – వా తదెగావు – వా కలం సర్కారు – వా ఆలాసుపూరు – వా కానుగోహాదా కలంగామా – వా వైరాగడం – వా రాజుగడా – వా భరతపురం – వా ఆంజిగామ – వా భంగారం – వా తరివిడి – వా శిరుపురం – వా జనుగామ – వా రామగిరి – వా చంన్నూరు – వా కాతీశ్వరం – వా కూదేవుపురం – వా వెలుగూరు – వా పెద్దపల్లి – వా వెలందుల – వా కోర్రెలి – వా కటుకూరు – వా నిజాంబాదు – వా రాచర్ల – వా కోరుట్ల – వా కతులాపురము – వా యెల్లుల – వా యంపల్లి – వ॥ ఆలుగడప – వా గాంధారి – వా సాతవెళ్ళి – వా మెదకు వా టేకుమహాలు –వా ఆలీనగరము – వా కల్యకూరు – వా వుత్తులూరు – వ॥ జోళచెరువు – వా నీలంగి – వా నిట్టూరు – వ॥ పండలాపురము – వ॥ జూలుకల్లు – వ॥ పొట్లచెరువు – వ॥ దుద్దినాల – వ॥ నరుసాపురము –వ॥ యేలూరు – వ॥ గొల్లపల్లి – వ॥ తూపురాను – వ॥ వుద్దిమర్రి – వ॥ జన్నగిరి – వ॥ చెరియాల – వ॥ తరిగొప్పుల – వ॥ నిడుగొండ – వ॥ నాంమెపల్లి – వ॥ అట్లూరు – వ॥ వెలది –వ॥శిరుకొండ – వ॥ వూటుకూరు – వ॥ కల్వల –వ॥ ఆల్కాపురము – వ॥ దేవగడ – వ॥ ముళ్ళ – వ॥ భరంపురి – వ॥ సోమరస్ – వ॥ ముత్తెన్న – వ॥ సమతుమణ్యము – వ॥ చిరువంచ – వ॥ విజయగిరి – వ॥ వలంగూరు – వ॥ వరంగల్లు –వ॥ వెలుగొండ– వ॥ కేసపట్నము – వ॥ రాచకొండ – వ॥ విబురాంపట్నము – వ॥ నడికుడి –వ॥ షహరునగరము – వ॥ విజయనగరం – వ॥ పొడిచేడు – వ॥ మునుగొండ – వ॥ యిరిపిరాల – వ॥ వేములకొండ – వ॥ నల్లగొండ – వ॥ అరువపల్లి – వ॥ పేరూరు – వ॥ దేవులపల్లి – వ॥ బెల్లంకొండ – వ॥ నేలకొండపల్లి – వ॥ వినికొండ – వ॥ వుర్లుగొండ – వ॥ వుంద్రుకొండ – వ॥ అనంత్తగిరి – వ॥ కంమ్మంమెట్టు – వ॥ కనకగిరి – వ॥ కొండపల్లి – వ॥ కొండవీడు – వ॥ గాండ్లబయ్యారం – వ॥ పాలంచ్చ – వ॥ మదిరె – వ॥ మేదూరు – వ॥ జంబులవాయ – వ॥ కందికొండ – వ॥ జల్లిపల్లి – వ॥ కల్వువాయ – వ॥ ఆకుల ఆరునాడు – వ॥ చాట్రాయి – వ॥ విజెయరాయి – వ॥ నూల్లస్థలము – వ॥ గుడివాడ – వ॥ కలిదిండి – వ॥ గొల్లపల్లి – వ॥ యేలూరు – వ॥ గుండుగోలు – వ॥ పెంటపాడు – వ॥ నిడుదోలు – వ॥ ఆతిలాసంట – వ॥ కాంభుశయి – వ॥

బాందురుజెల్లి – వ॥ దువ్వ – వ॥ రాజమహేంద్రము – వ॥ పలువెల– వ॥ ద్రాక్షారము – వ॥ పెన్దాపురం – వ॥ పింటాపురం – వ॥ సత్యపరము – వ॥ అనకాపల్లి – వ॥ కాసింకోట – వ॥ విజయనగరం –వ॥ భలింగం – వ॥ సికాకోళం – వ॥యిచ్చాపురం – వ॥ బరంపురం –వ॥ ధారాకోట – వ॥ కలకోటూరు – వ॥ గూచరా – వ॥ మచిలీబందరు – వ॥ ఆటగఢా – వ॥ శంబరువాడ – వ॥ వర్తసా – వ॥ మందసా –వ॥ జారాఢ – వ॥ జలాంత్తర – వ॥ గంజాము – వ॥ ఆశిఖి – వ॥ పురుషోత్తము – వ॥ భీమదేవు – వ॥ విజయదేవు – వ॥ నారాయణదేవు – వ॥జగన్నాధం – వ॥ శ్రీరంగము – వ॥ కంచి – వ॥ కాళహస్తి – వ॥ ఆదోని – వ॥ పులిచెర్ల – వ॥ ఆరుకాటు – వ॥ నాగనూరు –వ॥ వెలియాల – వ॥వెలిజాల – వ॥ సరికొండ –వ॥ అమరనాథ వ॥ తంగేడు – వ॥ కేతవరం – వ॥ కారంపూడి – వ॥ నందిగామ – వ॥ మాచర్ల – వ॥ గురిజాలా –వ॥ మహల్లా మహల్లెయలా – ౭౭ యీడెబ్బయి యేదు దుర్గాల వారుంన్నూ – యాభైయారు – ౫౬ రాజ్యాల వారుంన్నూ – మొదలయిన శిష్య సాంప్రదాయము శ్రీకేతేశ్వర లింగమతానకు దూపదీప – నైవేద్య దక్షణ తాంబూల – నిత్యజంగమారాధన – జరుగగలందుకు సదరువుంన్నా ప్రకారమునడిపింత్తుము – యీవరుర్శాశణం (యీవర్షార్చనం) మీ పుత్రపౌత్ర పారంపరియంత్తరం మా పుత్రపౌత్రపారంపరియంత్తరం సూర్య చంద్రాదులు వున్నంత్తకాలమున్నూ – యిది ధర్మసాక్షిగా నడిపింత్తుము – యీధర్మవరుషార్చనం నడిపించ్చినవారికి కాశిలో షోడశ మహాదానాలు చేసినవారికి – యేఫలంకదా మనకు ఆపుణ్యము ఫలించి సిద్ధించును – దీనికి యవ్వరు ఆచ్ఛేదన చేస్తారో వారికి – కాశిలో గోహత్య బ్రహ్మ హత్య శిశు హత్య, స్త్రీ హత్య, బ్రంహ్మణ హత్య పాతకాల పొందుదురు – యిందులో యవ్వరయిన ఆద్రగణము చేసిన దేసిముఖు దేశపాండయ్యా పటేలు పటువారీ – మంన్నెమచుకూరీ వగయరాలకు – యీ వరుషాశనము చూపించ్చి సంన్నదులో వున్న ప్రకారంగా నడిచే అట్లు చెప్పేది – వారు చెప్పంగ్గ వినని పక్షాన కులశెట్టి మహానాడు దైవమువారు చెప్పేది – వారు చెప్పంగ వినకపోయిన కులమువారు చెప్పేది – వారు చెప్పంగ వినకపోయిన – కులశాపకుడు – అనగా కులహీనుడు – గోత్రహీనుడు – గుణహీనుడు – వంశనాశకుడు అని వానికి శిక్ష అంమ్ము గాల్చి రొంమ్మున వేయించ్చేది – వాడు కాశీ గోదావరి తుంగభద్ర మొదలయిన నదులలో స్నానము చేసి నాలుక కాల్చుకొని వచ్చిన వానికి కులము యిచ్చే అందుకు అక్కర లేదు. వాంన్ని వూరు బయట వుంచ్చి వొక్కాకుల అంన్నము పెట్టి సాగతోలించ్చేది – వీని పేరు మేదరవాండ్ల యిండ్లలో

అడిగేటి వాడని పేరు పెట్టేది - యిది గాకను - యేకులములో మంన్నీరుకము చేసినా చాట్యతనము చేసినా - పటేలుతనము చేసినా వుప్పరమజూరి చేసిన - దొంగల్ల గలిశిన - దొంగ్గతనము చేసిన - మేదరవాడు - అనే పేరు వుండ్డెనా - వాని దగ్గెర యీ వరుషాశనం పుచ్చుకునేది - యిది మా ధర్మసాక్షిగా వ్రాసి యిచ్చిన పత్రికె.

శ్లోకం - స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
అన్యదత్తా పహరేణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥

స్వదత్తా పుత్రికా ధాత్రీ పితృదత్తాసహోదరి।
అన్యదత్తా భవేన్మాతా విప్రదత్తా వసుంధరా॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ర్ఛేయోనుపాలనం।
దానాస్త్ వర్గమ వాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

మద్యంశజాః పరమహీపతివంశజా వా।
యేభూమిపా స్సతతముజ్వల ధర్మచిత్తా।
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి।
తత్పాదుకద్వయ మహం శిరసావహామి॥

మేదరవాండ్ల యిండ్లలో యీరముష్టివాండ్లకు యిచ్చే మరియయాద పెండ్లికి ॥అర్ధనేబులు॥ యేడు॥ పోకలు॥ యిదిగాక యాడాదికి॥ యింటి వక్కంటికి ॥బ్యాడ చొప్పన యిచ్చేది. యిది పూర్వం పుట్టిన సిరసానమామి.

షహరు హాయిదరాబాదు
మహమ్మదానగరరం తుంమ్మల వూశంన్న
కలం ముట్టిన వ్రాలు తుంమ్మల లింగన్న
చౌదరి కలము ముట్టిన వ్రాలు తుంమ్మల
యల్లంన్న కలం ముట్టిన వ్రాలు
తోకల పాపడు కలం ముట్టినవ్రాలు
కనికరపు వీరప్ప కలం ముట్టినవ్రాలు
పాతకోట శివంన్న కలం
పాతకోట తింమన్న వ్రాలు
దుద్దిగల్ల వీరడు కలము ముట్టినవ్రాలు
దుందిగల్ల రాముడు కలం వ్రాలు
బొమ్మిడి వీరప్ప కలం వ్రాలు
దురికి యెల్లన్న కలం వ్రాలు
వాసం వూశంన్న కలం వ్రాలు
పెరసాని శివంన్న కలం ముట్టినవ్రాలు
యెనుమనగండ్ల నరసప్ప కలము
ముట్టినవ్రాలు
పెరసాని సాహెబు కలం వ్రాలు

బోనగిరి సర్కారు లో వగయిరా కలం
ముట్టినవ్రాలు
వాసం అంకులు వగయిరా పెద్దమనిశి
కలము ముట్టినవ్రాలు
బోనగిరిలో పూర్వపు చౌదరి పిల్లిరాఘవులు
కలం వ్రాలు
కొయ్యలకొండ సర్కారు కలము
ముట్టినవ్రాలు
సయుపు మంగంన్న కలం వ్రాలు
బిదరుకోటలో చవుదరిభోబంన్న కలము
ముట్టినవ్రాలు
గణాపురం సర్కారులో సత్రంజంగన్నచవుదరి
కలం వ్రాలు
ఆటుమాలివెలు బిదరుకోటలో తగ్గెళ్లపల్లి
నామాశెట్టిచవుదరివగయిరా క౹ం వ్రాలు
మెదకుసర్కారు వగయిరా మేద౹భక్తులు
కలము ముట్టినవ్రాలు
మెదకులో నందికంటి నర్సంన్న చవుదరి
కలము ముట్టినవ్రాలు
మెదకులో నోములయల్లప్ప కలం వ్రాలు

పొలాస తాలూకె కసుబె వగయిరా పెద్దమనిశి
బొమ్మిడి రాముడు కొడుకులు నాగంన్న
కలము ముట్టినవ్రాలు
గజవెల్లి పరుగణా వగయిరా మేదరి భక్తులు
కలం ముట్టినవ్రాలు
దుబాక కోసబానోజి పెద్దమనిశి కలంవ్రాలు
నీరారు వెలుగండ్దల వగయిరా పరుగణా
రాచెర్ల కసుబా వగయిరా మేదరభక్తులు కలం
ముట్టినవ్రాలు
రెషంబాలు పెద్దమనిశి కలంముట్టినవ్రాలు
మొకాం గంభీరావుపేట ఆడ్లూరి కసుబ
వగయిరా మేదరి భక్తులు కలం వ్రాలు
రామరెడ్డిపేటలో పూరిరాజంన్న పెద్దమనిశి
వగయిరా కలముముట్టినవ్రాలు
ఘందారి పరుగణా వగయిరా భక్తులు
కలమువ్రాలు
గుడుమల పరుగణ కలంముట్టినవ్రాలు
ఆయితానగరం వగయిరా మేదరి భక్తులు
కలంవ్రాలు
కలపనూరిశీమ వగయిరా పెద్దమనిశి

సిద్ధాంతి యెల్లు కలం వ్రాలు
కూకుట్లపల్లి లింగన్న వ్రాలు
కూకట్లపల్లి వెంక్కులు వ్రాలు
యిందూరి శ్యాయిగాడు వ్రాలు
లింగ్గంపల్లి లంచ్చన్న కలం వ్రాలు
యల్లవెల్లి పెదనరుసు వ్రాలు
యల్లవెల్లి జింక్కయ్య వ్రాలు
యల్లవెల్లి గుండ్లన వ్రాలు
లింగంవిల్లి కదారి వ్రాలు
కల్లేటి నాగప్ప వ్రాలు
పలారపు అంకులు వ్రాలు
కల్లేటియల్లన్న కలం వ్రాలు
తుంమ్మలయల్లన్న వ్రాలు
జోడిగ అంకుమా కలం వ్రాలు
జోడిగ లింగన్న కలం వ్రాలు
జోడిగె యెలుశెట్టి వ్రాలు
పాతకోట తంబయ్య వ్రాలు
కానుబాయివతనంకళ్యానముగారు కలము

మెదకులో నందికంటిలింగన్న కలము
ముట్టినవ్రాలు
నల్లకొంండ పరగణా కసుబ వగయిరా భక్తులు
కలం వ్రాలు
వెలుగందుల యల్లన్న కలం వ్రాలు
యిందూరు పరగణా వగయిరా భక్తులు కలం
ముట్టినవ్రాలు
భోదనం కసుబా వగయిరా వ్రాలు
భోదనంలో సిదాలక్ష్మడు వ్రాలు
కోటగిరి కసుబా వగయిరా వ్రాలు
కోటగిరిలో చెందూరిఅయలో
మద్రారంగడు మలుయల్లయ్య వ్రాలు
పాండుగంటిలో గుడుమలకాశంన్న కలం
వ్రాలు
చిలుకూరులో ఆలుమల్లింలింగంన్న కలం
ముట్టినవ్రాలు
కసుబ వగయిరా మేదరిభక్తులు
కటులుదురికిలో పాతకోట మాచంన్న వ్రాలు
బాసువాడలో యెపుయల్లంన్న
కైలాసకోట వగయిరా మేదర భక్తులు వ్రాలు

నోముల బుర్రి కలముముట్టినవ్రాలు
టేకుమహాలు పరుగనె వగయిరా భక్తులు
కలంవ్రాలు
పెద్దమనిశి మయిలో వూశంన్న
కలంముట్టినవ్రాలు
వుత్తులూరు శీమ వగయిరా భక్తులు కలం
ముట్టినవ్రాలు
పెద్దమనిశి ఆలుమల్లిగొల్లయ్యా
కలముముట్టినవ్రాలు
నోళచెరువు శీమా వగయిరా కలము
ముట్టినవ్రాలు
స్వాయిపెద్దమనిశి నంద్దికంటి సంగిశెట్టి
కలంవ్రాలు
బాల్కి తాలూకా చవుదరి మావురపు అంమ్మ
వగయిరా మే భక్తులు
నీలంగి తాలూకా చవుదరి వులిమల్లు కంన్న
వగయిరా కలంవ్రాలు
భీమనపల్లి వీరసాని పోశలు నరుసంప్ప
భీముడు కలం
నెటూరు తాలూక చవుదరి వానెలింగప్ప

ముట్టినవ్రాలు
అత్తకోట అత్తపురంపాతకోటయల్లయ్య
కలము ముట్టినవ్రాలు
బేడిగురువయ్య కలము ముట్టినవ్రాలు
యెంన్నారపు గురువయ్య కలం వ్రాలు
కంభంమెట్టు నరుసు కలము ముట్టినవ్రాలు
యిందూరు బుర్రి కలము ముట్టినవ్రాలు
కల్లేటిలింగంన్న కలము ముట్టినవ్రాలు
కొత్తకొండపెద్దాంకన్న కలం వ్రాలు
యల్లపల్లి నల్లగొండ వగైర
నల్లగొండలో నోములసర్వం
మయిసలో పెండారి దంమన్న
వేములకొండలో వాసంనాగన్న
యేముగంటి పరు॥క॥తుంమ్మల యల్లప్ప
కలము ముట్టినవ్రాలు
చెరియాల దిక్కు -
యేముగంటి ప॥దు॥ముచుకురులో జర్రిగె
రాముడు కలం వ్రాలు

కవులాస కోటలో మెదకు అనుమంత్తు
దెగులూరులో యెరెకాట కల్లంన్న
కూర్రెడలో జోర్రిగె జియ్యేరు
నిర్మల పంచ మహల్ తాలూకా వగయిరా
మేదరి భక్తులు కలం వ్రాలు
నిర్మలలో వెలుగందుల నాగశెట్టి చవుదరి
కలంవ్రాలు
తురుకల చందాతాలూకలో వ॥భ॥
కలంవ్రాలు
యెదులాపురములో బమ్మిడిమల్లయ్య
కలంవ్రాలు
చెంగాపురంలో ప॥
కసుబాలో భక్తులు కలంవ్రాలు
యింగనగాములో జవాజ్ వెంకంన్న
చవుదరిశెట్టి కలంవ్రాలు
ఆకుసుపూరు ప॥క॥ మంగులూరు శనిగరపు
పోశెటి కలంవ్రాలు
నాగపురి షహరు క॥బుధవార వ॥భక్తులు
కలంవ్రాలు
బుధారంపేటలో వేముల ఆలిశెట్టి కలం

వగయిరా భక్తులు
చిట్టుగుప్తి తాలూకా చవుదరి పందిగిరి
ములుకన్న కలం
వుమునాబాదలో ఆలుకేటి యీరంన్న కలం
వుమునాబాద తూపులినాగంన్న
కలముముట్టినవ్రాలు
కల్యాణం మ రూక ॥వ॥భ॥క॥ము॥వ్రా॥
కళ్యాణములో పసుపుల వీరంన్న చవుదరి-
కలం
యాదగిరిలో లింగెడి వంన్నప్ప భీమన్న
మల్లంప్ప పులిమల్లంప్ప సంజంన్న రామప్ప
కలము వ్రాలు
చించోలి ప॥వ॥మొ॥భ॥
పులినరుసంప్ప చౌదరి కలంముట్టినవ్రాలు
సూదెగామలో నుత్తిని పెదనరుసప్ప కలం
వ్రాలు
కోటగిరిలో పెరసాని నరుసంప దానప్ప కలం
కసుబె కరినెకోటలో కోనా నాగంన్న చవుదరి
కలం
పొల్లాతకా కసుబె జెగిత్యాల పెద్దమనిశి

వెలుగందుల సర్కారు వ॥ప॥
ధర్మపురిలో మామిడిపల్లి మల్లయ్య
యాదగిరిలో లింగేడివన్నంప్ప పులిమల్లప్ప
అయ్యగారికి భంగారికడియాలు బ్నాతు
పచ్చుడం యిచ్చి నమస్కారము
చేసినాడు॥క॥ము॥వ్రాలు
వెలిగడుప - ॥క॥వ॥భా॥ వ్రాలు
వెలిగడపలో శిలివెరు శివన్న మేతరి
కొడుకు ముత్సు అయ్యగారికి గంట యిచ్చి
దాసోహం చేసినాడు కలం వ్రాలు
వరంగల్లు సర్కారు వ॥ మేదరి భక్తులు కలం
వ్రాలు
పిల్లిమెట్టు పిల్లికొండంన్న కలము
ముట్టినవ్రాలు
వరంగల్లు మొకాము పిల్లి శివన్న కలం
వ్రాలు
పిల్లిమెట్టు పిల్లిరాజంన్న కలం వ్రాలు
మదిరె పాపీడు కలం ముట్టినవ్రాలు

ముట్టినవ్రాలు
మంగళారంప్యాటి ప్రతాపగిరి ఆంగిశెట్టి
కలంవ్రాలు
అయితారంప్యాటలో పుటుమాదుశెట్టి
కలంవ్రాలు
శీతాంబరములో పందిగిరికోనేరుశెట్టి
కలంవ్రాలు
చాందాలో పాతకోట కూరెశుశెట్టి కలంవ్రాలు
రామగిరి సర్కారు వ॥ కలంవ్రాలు
రామగిరిలో బల్లమల్లయ్య సయభు ఆంకులు
కలం ముట్టినవ్రాలు
వెలుగందులలో ముసలి సర్కారు కలం
ముట్టినవ్రాలు
వెలుగందులలో నలిపిరెడ్డిముసలి కలంవ్రాలు
కోలంపల్లిలో పెరసానిసరుసప్ప కలం
ముట్టినవ్రాలు
కడసుగామ ప॥క॥వ॥
ముగుతాల్లో పులిబీమన్న కలం ముట్టినవ్రాలు
దనువాడలో కోనముసలయ్య కలంవ్రాలు

పోతుఆశులు కలముముట్టినవ్రాలు
కోశిగె పరుగణె కసుబె వగయిరా మేదరి
భక్తులు
కోశిగ చవుదరి పులిఅనుమంత్తు కలము
ముట్టినవ్రాలు
ధర్మపురిలో మామిడిపల్లి మల్లయ్య కలంవ్రాలు
కనుకుర్తిలో పెరసాశ యల్లప్ప చవుదరి కలం
వ్రాలు
దంత్తలావంల్లి పరుగణె వగయిరా।
వూటుకూరి నయిబు తంమ్మంన్న చౌదరి
కలము వ్రాలు
నారంరావుపేటలలో నయిబు భీమంన్న చౌదరి
కలముముట్టినవ్రాలు
కనికెరపు అయ్య ఆయ్యప పెదమనిషి
వగయిరా కలము ముట్టినవ్రాలు
ఝెటాప్రోలు తాలూకా వగయిరా పెద్దమనిషి
కలముట్టినవ్రాలు
యెలూరులో వుబ్బా ఆంమంన్న
కలముట్టినవ్రాలు

యాదగిరి కసుబెడిలో తోకల అయ్యముదప్ప
రాజన్న రాయప్ప కలం వ్రాలు
కొలనుపాకలో వాసండి విశ్వనాథుడు కలం
వ్రాలు
రామగిరిలో బల్లంమల్లయ్య
సాహెబు అంకులు కలం వ్రాలు
కలువచెర్లలో సత్రం రాముకొండయ్య
వెంకటరాముడు కలం వ్రాలు
నడికుడి పరగణాకు ॥వ॥ పెరసాబ సోమన్న
పెద్దమనిశి వ॥ కలము ముట్టినవ్రాలు
పోట్లచెరువు ప॥క॥వ॥భు॥క॥
పాతిములో నందికంట్టి సత్తన్న పెద్దమనిశి
వగయిరా కలము ముట్టినవ్రాలు
మామిడిపల్లి గిరుమాజి కొడుకు అంకులు
కలం వ్రాలు

కొయ్యకొండ్ల సర్కారు కసుబ కోటకొండలో
పెరసానిమల్లన్న చవుదరి వగయిర కలం
ముట్టినవ్రాలు
కందూరు పరుగణ వగయిరా భక్తులు మేదరి
కలంవ్రాలు
పల్లి సయబు పోతన్న చవుదరి కలము వ్రాలు
సూగూరుతాలూకవారు వగయిరా భక్తులు
కలంవ్రాలు
కొత్తకోట సయను బాగప్ప క॥వ్రాలు
గద్వాల తాలుక మేదరి భక్తులు కలంవ్రాలు
పొలాసతాలూక పెద్దమనిశి బంమ్మిడి
లింగంన్న కొడుకు పెద్దరాజన్న వీడ్ల మీరాసి
పోలాస మధ్యన రాఘవాపురం పోయినారు
కలంవ్రాలు
దర్మపురిలో మదిమివంల్లి శిరుమాజీ
కూరుమవాడ్ల పింల్లాగా 13 నాదుకుంన్నారు
తానిమియాశినాగోలుదంశేరా ఆంల్లిపురం
మూడు అందుల జంన్నల కూకెలంన్నారు
కులం రాజి చేసి యింటిలో వుంచుకున్నారు
వానిపేరు అంకులూ పార్వతి గోత్రం కలము
ముట్టినవ్రాలు

తాటికొండ పరుగణె కసుబె వగయిరా మేదరి
భక్తులు కలముట్టినవ్రాలు
పాలమూరి మోపింల్లిపోశెట్టి కలముట్టినవ్రాలు
శ్రీశైలం నదరూ గోదల్ తాలూకా వగయిరా
మేదరి భక్తులు కలముట్టినవ్రాలు
చవుటపంల్లిలో జేడి యెంగ్గంన్న పెదమనిషి
వగయిరా కలముట్టినవ్రాలు
రెడ్డిపేటలో తౌకలరాజలింగము చౌదరి
కలంవ్రాలు

## వర్షాశనపు దానపత్రికలో వచ్చినపదాలకు వివరణ:

(మేదరిమఠం వర్షాశనపు దానపత్రికలో వచ్చిన పంచాచార్యులు, పంచాచారాలు, అష్టావరణాలు, షట్స్థలాలు, షట్ కర్మలు, పంచపీఠాలు లేదా పంచమఠాలు, వీరముష్టి నేబులు అనే పదాలకు వివరణ పాఠకుల సౌకర్యంకోసం ఇవ్వబడింది.)

### పంచాచార్యులు

వీరశైవులు సృష్టిప్రారంభంలో నంది, ప్రమథ గణాలై ఉద్భవించారని, ఆగణ వంశస్థులే ఆచార్యులని, ఆఆచార్య పరంపరయే భక్తమహేశ్వరులని, ప్రతియుగంలో శివాంశ సంభూతులైన పంచాచార్యులు వీరశైవమతోద్ధరణకు వేరువేరు పేర్లతో అవతరించి శివభక్తిని ప్రపంచమంతా వ్యాపింపచేసారని వీరశైవుల విశ్వాసం.

**శ్రీరేణుకాచార్యులు**

**అథ త్రిలింగవిషయే కుల్యపాభిధే స్థలే**
**సొమేశ్వరమహాలింగాత్ ప్రాదురాసీత్ స రేణుకః**

పరమేశ్వరుని ఆజ్ఞానుసారం శ్రీరేణుకాచార్యులు త్రిలింగదేశములోని సుప్రసిద్ధశివక్షేత్రమగు శ్రీకొలనుపాక క్షేత్రంలో వెలసియున్న శ్రీసొమేశ్వర మహాలింగమునుండి అవతరించాడు.

వీరు కొలనుపాక శ్రీసొమేశ్వరలింగమునుండి ఉద్భవించి రంభాపురి (బాళేహళ్ళి)లో శ్రీవీరసింహాసనాన్ని స్థాపించారు. వీరు కృతయుగంలో ఏకాక్షర శివాచార్యులని, త్రేతాయుగంలో ఏకవక్త్రశివాచార్యులని, ద్వాపర యుగంలో రేణుకశివాచార్యులని, కలియుగంలో రేవణసిద్ధ(రేవణారాధ్యుడు)డని ప్రసిద్ధిపొందాడు. వీరు కృతయుగంలో అగస్త్యమహామునికి వీరశైవ సిద్ధాంతాన్ని ఉపదేశించాడు. త్రేతాయుగంలో విభీషణుని ప్రార్ధనమేరకు ఒకే ముహూర్తంలో మూడుకోట్ల శివలింగాలను ప్రతిష్ఠించాడు. ద్వాపరయుగంలో అనేకమహిమలను ప్రదర్శించడంచేత రేణుకతీర్థం, రేణుకసరోవరాలని ప్రసిద్ధిగాంచినవి. కలియుగంలో విక్రమచోళ, బిజ్జళ మొదలగు అనేక రాజులను ఉద్ధరించి, హావినహాళ కల్లయ్య, మడివాల మాచిదేవులు, గురుపుంగవులైన శ్రీమల్లికార్జునస్వామి మొదలగువారికి శివదీక్షను ఇచ్చి, సొల్లపురం శ్రీసిద్ధరామేశ్వరుని భవిష్యత్తుజన్మను వారి తల్లిదండ్రులకు తెల్పి, గోరక్షకు ఖర్పరాదుల గర్వం అణచి, శ్రీశంకరాచార్యులవారి ప్రార్ధన ప్రకారం వారికి సర్వసిద్ధి ప్రదాయకమైన శ్రీచంద్రమౌళీశ్వరలింగాన్ని, రత్నగర్భ గణపతిని

అనుగ్రహించి, కల్యాణ బసవేశ్వరుని సోదరి అక్కనాగమ్మకు ఇంగళేశ్వరగుహలో శివయోగ సకల రహస్యాలను తెలిపి, కల్యాణపట్టణానికి ప్రధాని భక్తికి బీజమైన శ్రీబసవేశ్వరుని ప్రాసాదభవనంలో క్రియామూర్తియై తరువాత తమ స్థానమున రుద్రముని దేవరనునిల్పి, భారతదేశమంతా సంచరించి చివరికి తానుద్భవించిన కొలనుపాక శ్రీసోమేశ్వర లింగమునందే ఐక్యమై శివసాన్నిధ్యం చేరారు.

**శ్రీదారుకాచార్యులు**

శ్రీదారుకాచార్యులు మహారాష్ట్రలోని ఉజ్జయిని వటక్షేత్రానికి సంబందించిన శ్రీసిద్ధలింగేశ్వరలింగము నుండి ఉద్భవించి అచటనే శ్రీసద్ధర్మసింహాసనాన్ని నెలకొల్పారు. తరువాతవచ్చిన జగద్గురువులు కారణాంతరాలచేత ఈపీఠాన్ని కర్నాటకలోని ఉజ్జయినికి మార్చారు. శ్రీదారుకాచార్యులు కృతయుగంలో ద్వ్యక్షరశివాచార్యులని, త్రేతాయుగంలో ద్వివక్త్ర శివాచార్యులని, ద్వాపర యుగంలో దారుక శివాచార్యులని, కలియుగంలో మరుళసిద్ధ (మరుళారాధ్యులని) శివాచార్యులని ప్రసిద్ధిగాంచారు. వీరు లోకప్రసిద్ధులైన దధీచి మహర్షి ప్రార్ధనమేరకు శివ సిద్ధాంతాన్ని ఉపదేశించి తనకు శిష్యునిగ చేసుకొని, ప్రజలను భయకంపితులను చేస్తున్న కొల్లాపురము మాయ గర్వాన్ని అణచి దేశంలో ప్రశాంతతను నెలకొల్పి, దేవనందనుడను రాజు భక్తికి ప్రసన్నుడై అతనికి శివ సిద్ధాంతాన్ని బోధించి మోక్షాన్ని పొందుటకు అర్హునిగాచేసి, చివరకు మల్లికార్జున శివాచార్యులకు ఉత్తరాధికారాన్ని అనుగ్రహించి, దేశమంతటా పర్యటించి తాముద్భవించిన వటక్షేత్రములోని సిద్ధేశ్వరలింగమునందే ఐక్యమై శివలోకం చేరారు. వీరి పేరిట కాశీక్షేత్రంలో ఇప్పటికీ దారుకేశ్వరతీర్థం, దారుకేశ్వరం విరాజిల్లుతున్నాయి. కొన్ని ప్రదేశాలలో మరుళసిద్ధేశ్వర క్షేత్రాలు వెలిశాయి. ఈశివాచార్యుని చరిత్ర మరుళసిద్ధేశ్వర చరిత్రగా రచించబడింది.

**శ్రీఘంటాకర్ణ శివాచార్యులు**

ఇతడు దాక్షారామక్షేత్ర (హిమాలయపర్వతప్రాంతము) లోని శ్రీరామనాథలింగనుండి ఉద్భవించి హిమాలయములందే శ్రీవైరాగ్య సింహాసనాన్ని స్థాపించారు. ద్వాపర యుగంలో బాణాసురుని పుత్రిక మరియు అనిరుద్ధుని భార్య ఉషాదేవి ఈ మఠానికి జీర్ణోద్ధరణ కావించుట వలన ఈమఠం ఉషామఠమని పేరు పొందింది. ఈమఠమే క్రమేపి ఊఖిమఠంగా ప్రసిద్ధిచెందింది. శ్రీఘంటాకర్ణ శివాచార్యులు కృతయుగంలో త్ర్యక్షరశివాచార్యులని, త్రేతాయుగంలో త్రివక్త్ర

శివాచార్యులని, ద్వాపరయుగంలో ఘంటాకర్ణ శివాచార్యులని, కలియుగంలో ఏకోరామారాధ్య శివాచార్యులని ప్రఖ్యాతి చెందారు. వీరు కృతయుగంలో 18 పురాణాలను రచించి జగత్ప్రసిద్ధి చెందిన వ్యాసమహర్షి ప్రార్ధన మేరకు అతనికి శివసిద్ధాంత తత్వాన్ని ఉపదేశించి తనకు శిష్యునిగ చేసుకొన్నాడు. త్రేతాయుగంలో గౌతమేంద్ర చక్రవర్తిని అనుగ్రహించి పరమశివభక్తునిగా చేసాడు. జనమేజయ మహారాజు వేయిగ్రామాలను ఈపీఠానికి దానంగా ఇచ్చాడు. వీరు కలియుగంలో ఏకోరామారాధ్యులనుపేర రామనాథ లింగనుండి ఉద్భవించి దేశంలో పర్యటించి అనేక మహిమలను ప్రదర్శించి అదే లింగనందు ఐక్యమై శివసాన్నిధ్యంచేరారు. ఇతడు జైనులకు పెట్టని కోట అయిన అబ్లూరులో బహిరంగంగా తన తలను తెగనరకుకొని వారం రోజుల తరువాత దానినిపొంది జైనులపై శివాధిక్యాన్ని ప్రకటించాడు. అప్పుడు కొందరు జైనులు పారిపోగా మిగిలినవారు శైవమతాన్ని స్వీకరించారు. శివునిపై అనన్య భక్తి భావం కలిగియున్నందున ఇతడు ఏకాంతరామయ్య అను బిరుదనామం వహించాడు.

**శ్రీధేనుకర్ణ శివాచార్యులు**

ఇతడు శ్రీశైలక్షేత్రంలోని శ్రీమల్లికార్జునలింగం నుండి అవతరించి శ్రీశైలక్షేత్రంలో శ్రీసూర్యసింహాసనాన్ని నెలకొల్పారు. వీరు కృతయుగంలో చతురక్షర శివాచార్యులని, త్రేతాయుగంలో చతుర్వక్త్రశివాచార్యులని, ద్వాపరయుగంలో ధేనుకర్ణ (శంఖుకర్ణ) శివాచార్యులని, కలియుగంలో పండితారాధ్య శివాచార్యులని ప్రసిద్ధిగాంచారు. వీరు సానందమహర్షికి వీరశైవ సిద్ధాంతాన్ని ఉపదేశించి తనకు శిష్యునిగా చేసుకొన్నారు. వీరికి శంఖుకర్ణులనే మరొక పేరు కలదు. ఆపేరుగల విగ్రహం ఉన్నది. శంఖుకర్ణ విగ్రహాన్ని పూజించినవారికి అశ్వమేధయాగం చేసిన దానికన్న పదింతల ఫలం లభిస్తుందని వ్యాసమహర్షి ధర్మరాజుకు తెలిపాడు. హరిప్రియుడను పింగళుని తండ్రియైన శ్వేతునకు శ్రీశైల క్షేత్రంలో సదానందలింగజంగములను గురువులు కలరు. వారిని సేవించినందున ఇతని పుత్రుడైన పింగళుడు రోగంనుండి విముక్తుడైనాడు. కలియుగంలో పండితారాధ్యులవారు శ్రీశైలమల్లికార్జునలింగం నుండి ఉద్భవించి భూమండలమంతా పర్యటించి అనేక రాజులను ఉద్ధరించి చివరకు తానుద్భవించిన లింగమునందే ఐక్యమయ్యారు.

### శ్రీవిశ్వకర్ణ శివాచార్యులు

వీరు మహాపవిత్రమైన కాశీ క్షేత్రంలోని శ్రీవిశ్వనాథజ్యోతిర్లింగమునుండి ఉద్భవించి శ్రీకాశీ క్షేత్రమందే జ్ఞానసింహాసనాన్ని స్థాపించారు. వీరు కృతయుగంలో పంచాక్షరశివాచార్యులని, త్రేతాయుగంలో పంచవక్త్ర శివాచార్యులని, ద్వాపరయుగంలో విశ్వకర్ణశివాచార్యులని, కలియుగంలో విశ్వారాధ్య శివాచార్యులని ప్రఖ్యాతి గాంచారు. వీరు లోకప్రసిద్ధులైన దుర్వాస మహర్షి ప్రార్థనమేరకు అతనికి శివతత్త్వోపదేశం చేసి తన శిష్యునిగా చేసుకొని, నేపాలు, కాశ్మీరు మొదలగు దేశాధిపతులకు వీరశైవ సిద్ధాంతాన్ని ఉపదేశించి చివరకు తానవతరించిన కాశీవిశ్వనాథ లింగమునందే తన దివ్యదేహాన్ని ఐక్యమొందించారు.

## పంచాచారాలు

ప్రతివీరశైవునకు ఆచారమే భూషణం. ఆచారం లేనివాడు లోకంలో నిందితుడగును. ఆచారయుక్త జ్ఞానం వలననే పరమేశ్వరుడు ప్రసన్నుడౌతాడు. కావున దేహముండువరకు ఎంతటి జ్ఞానియైనను ఆచారాన్ని పాటిస్తుండాలి. వీరశైవులకు లింగాచార, సదాచార, శివాచార, భృత్యాచార, గణాచారాలని పంచాచారాలు విహితములు. ఇవి మనోబుద్ధి చిత్త అహంకారాలను కుదుర్చు మార్గాలు.

### 1. లింగాచారము

లింగాచారమనగా శివుడే ఏకైక దైవమని నమ్మి శివదీక్షను పొంది ఓంకారాత్మక మైన లింగాన్ని పూజించుట. లింగాన్ని తన ప్రాణంగా భావించుట. కావున అనేక జన్మ పుణ్యకృత పరిపాకవశాన సంస్కారాసక్తుడైన శిష్యుడు శుభలక్షణాన్వితుడై సద్గురునిచేత దీక్షితుడై ఆణవమాయాకార్మికమలత్రయమును వెధా, క్రియా, మాంత్రిక దీక్షాత్రయముచే దహించి ఇష్ట, ప్రాణ, భావలింగత్రయమును పొందును. అట్టి లింగత్రయమును భక్తుడు ఎల్లప్పుడు పూజించును. సమస్తమును అట్టి లింగమునందే చూచుచుండవలయును. లింగము వినా ఇతర దైవాలను పూజించకూడదు. "సర్వత్ర లింగమ్మన్యేత్" ఇదియే లింగాచారము.

### 2. సదాచారము

సదాచారమనగా ఏదొ వొక వృత్తి నవలంబించి, పరవనితా విత్తాలను ఆశించక నిజాయితీతో ధనార్జనచేసి తన కుటుంబాన్ని పోషించుకొనుటయేగాక గురుజంగాలను ఇతరులకుకూడ అన్నవస్త్రాలనిచ్చి ఆదుకొనుట. ఎల్లప్పుడు నీతితో పవిత్ర మనోభావంతో

ప్రవర్తించుటయే సదాచారము. ఏమార్గముచేత భక్తుడు తాను సంతుష్టుడై యితరులను సంతృప్తి పరచునో అదియే సదాచారమని సూక్ష్మాగమవచనమున కలదు.

**3. శివాచారము**

సమస్తలోకైక కారణుడగు పరబ్రహ్మమైన శివుడొక్కడే కాక రెండవవాడు లేడనే భావమే శివాచారము. కనుక శివునియందు మనస్సు లీనము చేసి శివ సంస్కార యుతుడై శివభక్తులందరు ఒక్కటేయని తలచి వారే వృత్తులవలంబించినను గణించక, వారందరితో భోజన, వివాహాది సంబంధములను కలిగి ఉండుటే శివాచారము. షోడశ శుద్ధులను గ్రహించి శుచిర్భూతుడై ఉండవలెను. మరియు – భవిశబ్దము, పాపశబ్దము, హింసశబ్దము, శ్వపచశబ్దము, అసత్యశబ్దము, అష్టవిధశబ్దములను వినకుండ లింగార్చన చేయవలెను. మరియు నిర్లోభము, నిష్ప్రయత్నము, శీలము, శాంతము, దయా, నిస్పృహత్వము, అనసూయ, దోషారోపణ శూన్యతతో ప్రయత్నపూర్వకముగా వర్తించవలెను. ఈఏడువిధముల మనోశుద్ధినిపొంది లింగార్చన చేయవలెను. ఇదే శివాచారధర్మము.

**4. గణాచారము**

సదాచారుడు శివనింద వినకుండుటయే గణాచారమనబడును. శివనింద వినిన నిందితుని దండించవలెను, అధవా ఆక్షేపించవలెను, అట్లుగాకున్న ఆచోటువిడచి వెడలిపోవలెను. అసత్యము, నిలకడలేనిమాట, మోసపుచ్చుట, పంక్తి భేదము చేయుట, ఇష్టములేనిమాటాడుట, నిర్దయత్వాలను సద్భక్తుడైన వీరశైవుడు వదలవలెను. బుద్ధికుశల సంపన్నుడైన భక్తుడు క్రోధరహితము, యదార్ధవాక్యము, భవి భక్త విమర్శనము, అనుగ్రహము, ఓర్పు, సత్పాత్రదానము వీటిని యధావిధి ఆచరించవలెను. మరియు భక్తుడు పంచసూతక వర్జితుడు కావలెను మరియు 64 శీలములనాచరించవలెను. ఇట్టిగుణములచే కూడినదే గణాచారము.

**5. భృత్యాచారము**

కుల శీలములను పాటించుట భృత్యాచారము. భృత్యాచారమనగా శివునకు, శివభక్తులందరికి తాను భృత్యుడనని నమ్రతతో మెలగుట. శివశరణులే పెద్దలు తానే చిన్నయని భక్తితో వారినాదరించుటయే భృత్యాచారము. ఇట్టి ఆచారసంపన్నుడే సజ్జనుడు. దాసత్వము, వీరదాసత్వము, భృత్యత్వము, వీరభృత్యత్వము, సమయాచారత్వము, సకలాచారత్వము అని ఆరు సజ్జనలక్షణములు. 1. నియమముతో

అనగా దీక్షాప్రతిజ్ఞ గలవాడై గురులింగ జంగమాదులందు తను, మన, ధనములర్పించుటయే దాసత్వము. 2. శివునియందే అనురక్తి గలిగి పరదైవ నిరాసక్తుడై నిరంతరము శివభక్తి కలిగి ఉండుటే వీరదాసత్వము. 3. జంగములను, మహేశ్వరులను భుజింపజేసి శేష ప్రసాదాన్ని భుజించుటయే భృత్యత్వము. 4. భస్మాది ప్రసాదాంతము అష్టావరణ సిద్ధితో కూడుకున్నవాడై దారేషణ, ధనేషణ, పుత్రేషణ అను ఈషణత్రయములను వర్జించి క్రియాలోపమైన ప్రాణాలను సహితమర్పించుటయే వీరభృత్యత్వము. 6. తనసర్వసంపత్తులు జంగములకర్పించుటయే సమయాచారత్వము. 7. సమస్త మును శివసంబంధ స్వరూపమని స్మరించు నిర్మల నిరహంకారమే సకలాచారత్వము. మరియు జాత్యాశ్రమ కులగోత్ర నామారూప క్రియారహితుడై గురురూపావస్థచేత గురుప్రత్యక్షుడై ఆగురువువలన చిద్ఘనమహాలింగాన్ని పొంది ఆలింగ సహితుడయి భక్తి, జ్ఞాన, వైరాగ్య, పాదోదక, ప్రసాద, విభూతి, రుద్రాక్ష, మంత్రాది, షట్స్థల మార్గముచేత భక్తగణములందు పంచసూతకములు కల్పించక వారుండు స్థలమునకు పోయి తన తనుమనధనములను సమర్పించి వారి శేష ప్రసాదాన్ని భుజించి హస్తాంజలిబద్ధుడై ప్రత్యుత్తమివ్వకుండునదే భృత్యాచారం.

## అష్టావరణములు

అష్టవిధ ఆధ్యాత్మికాచరణాలకు ఆవరణాలని పేరు. అవి గురు, లింగ, జంగమ, పాదోదక, ప్రసాద, భస్మ, రుద్రాక్ష, మంత్రాలు. ఇవి గలవాడే వీరశైవుడు. తొటమాలి తన తోటకు పశువుల వలన నష్టము కలుగ కూడదని తోట చుట్టు కంచె వేసినట్లు, రాజు తనకు శత్రువులచే అపజయము కలుగకూడదని తన నగరానికి కోటను నిర్మించుకొన్నట్లు, అష్టావరణాలను ఎనిమిది ఆవరణాల కోటలోనున్న వీరశైవునికి కామక్రోధలోభాది అరిషడ్వర్గాల నుండి, అజ్ఞానం నుండి తగు రక్షణ లభించుటయేకాక అతనికి భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు చేకూరి శివానుభవము పొందు మార్గము సుగమమగును. ఈఅష్టావరణానుష్టానమే ముముక్షువునకు అత్యావశ్యకం. దీనివలననే లింగాంగ సామరస్యము సిద్ధించుచున్నది.

### 1.గురువు

గురువు లౌకికాధ్యాత్మిక, జ్ఞానసంపన్నుడైయుండి శిష్యునకు శివదీక్ష ఇచ్చి మంత్రయుక్తంగా శివలింగమును ప్రసాదించవలెను. మతసూత్రాల గురించి, మతాచారాలగురించి, వాటి అంతరార్థాల గురించి శిష్యునకు బోధించి శివానుభవ

సాధనాపథంలో అతనిని సక్రమంగా నడిపింపవలెను. గురువు చెప్పిన విధంగా ఆచరించి శిష్యుడు విశేషలాభం పొందగలడు. కావుననే గురువుకు అష్టావరణాలలో ప్రథమస్థానమివ్వబడింది. శుకరహస్యోపనిషత్తు వచన ప్రకారము శ్రీగురువు సాక్షాత్తు బ్రహ్మ స్వరూపుడని, జ్ఞానమూర్తియని, తత్వమస్యాది అనగా లింగాగ సామరస్య జ్ఞానము కలవాడని, నిత్యుడని, అమలుడని, గుణరహితుడని అనేకవిధాల కొనియాడబడెను. అట్టి సద్గుణ సంపన్నుడైన గురువును ఆశ్రయించి భక్తుడు ముక్తిని పొంది ఆత్మ సుఖాన్ని అనుభవించవలెను. జనన మరణాదులకు కారణాలైన కర్మబంధాలే పాశాలు, తత్పాపాశాలచే పీడించబడుతున్న మానవులే పశువులు. అట్టి పశువుల పాశాలనుండి తొలగించి శివైక్యమును బోధించు బోధకుడే గురువు.

**త్రివిధ గురులక్షణములు**

**దీక్షా గురువు :** శివలింగైక్యుడే దీక్షా గురువనబడును. ఏ సంస్కార విశేషము వలన ఉత్కృష్టమైన శివజ్ఞానము కలుగునో, మలమాయాది పాశబంధము నశించునో, ఆ సంస్కారమె దీక్షయనబడును. అట్టి జ్ఞానక్రియా లక్షణ లక్షితమైన దీక్షయందు శివతత్వోపదేశమును చేయగల శివలింగైక్యుడే దీక్షాగురువనబడును.

**శిక్షా గురువు:** ఈ దీక్షాగురువే శిష్యుని ప్రశ్నలకు సమాధానముచెప్పి ఉపదేశము ద్వారా సంశయ నివృత్తిచేసి అతనిని శిక్షించు చున్నందున శిక్షాగురుస్థల సంపన్ను డగును. అతడు శిష్యుని భవమను చీకటిని నశింపచేయుచు ప్రాపంచిక భేద భ్రాంతిని నివారించును. తన శిష్యుల హృదయ కమలములందుకల నిజరూప చిత్రాన్ని శివజ్ఞానమను దీపముచేత చూపించునో ఆశిక్షాగురువే మానవుల సంసారరోగమును పోగొట్టు ఉత్కృష్ఠ శివాద్వైతజ్ఞానమను పరమౌషధాన్నిచ్చి జనన మరణాది దుఃఖ నివృత్తి చేయును.

**జ్ఞానగురువు:** శాస్త్రస్థితమైన రహస్యార్థములను బోధించి శిష్యుని సంశయములను నివారించు దీక్షాగురువే అతనికి సాక్షాచ్ఛివజ్ఞానమునను గ్రహించువాడై జ్ఞానగురు వనబడును. ఈగురువు చేతనే శివజ్ఞానమును పొంది శిష్యుడు జీవన్ముక్తుడౌతాడు. సారాంశమేమనగ గురువు ఒక్కడే శివజీవైక్యోపదేశము చేయునప్పుడు దీక్షాగురు వని, అందలి సంశయాలను శాస్త్రోక్తరీత్యా నివారించునప్పుడు శిక్షాగురువని, చివరకు శివజీవైక్యజ్ఞానాన్ని అనుగ్రహించి ముక్తుని చేయునప్పుడు జ్ఞానగురువనియు పిలువబడుచున్నాడు. అనేకగురువులను ఆశ్రయించవలెనని తాత్పర్యముగాదు. అట్టి

త్రిగురుస్వరూప ప్రకాశితుడైన సద్గురువును శిష్యుడు ప్రతి దినము ధ్యానించును.

**2. లింగము**

లింగము మతపరమైన ఆచారాలకు పూజలకు కేంద్రస్థానం. ఏ పరబ్రహ్మంలో చరాచర ప్రపంచమంతా లయించి మరల మరల ఉద్భవించునో అట్టి బ్రహ్మమే లింగమని, అట్టిలింగమే సాక్షాచ్ఛివ స్వరూపమని, ఆ హృదయస్థిత జ్యోతిర్లింగం సర్వులచే పూజనీయమని, ఆప్రాణలింగమే సద్గురుచే ఇష్టలింగంగా స్థూలపూజకై అనుగ్రహించబడును. ఆఇష్టలింగం ఆజీవాంతము దేహముపై ధరించి కరస్థలమునందే పూజించవలెను. ఈకరస్థల లింగార్చనము చేతనే సర్వసిద్ధులుగలిగి జీవన్ముక్తి కలుగును. హరిబ్రహ్మాది దేవతలు, మనుష్యపశుపక్ష్యాదులు కూడ శివలింగార్చనము చేతనే ముక్తులైనారు. అందువలన ఈ లింగధారణము పరమ పవిత్రమైనది.

**3. జంగమ**

జంగమము అనగా కదలునది అని శబ్దార్థము. అది ఒక వ్యక్తికి అన్వయించి నపుడు జంగమ లింగము లేక చరలింగము అనగా దేశసంచారం చేస్తూ, శిష్యులకు మతబోధ చేయువాడని అర్థము. అతడు శివయోగియై, జీవన్ముక్తుడై, శిష్యులకు మోక్షసాధనను ఉపదేశించు అధికారము కలవాడై ఉండవలెను. సర్వజనులను అనుగ్రహించు శివుడే గురులింగజంగమాదులను మూడుప్రకారములుగా విభజింపబడి భుక్తిముక్తులనొసగుటకు భూమియందు వర్తించుచుండును. లింగము చరాచరమని అనగా జంగమ, స్థావరములని రెండు విధములని, శిలాది నిర్మితమైన లింగమే అచర(స్థావర) లింగమని, శివయోగియని ప్రసిద్ధి గాంచిన లింగమే జంగమమని అట్టి చరలింగమను జంగమస్వరూపము, స్థావర లింగముకన్న శ్రేష్ఠమని సిద్ధాంత శిఖామణి అభిప్రాయము. ఋగ్వేదారణ్యక వచన ప్రకారము ఈశ్వరుడే జంగముడై అతిథివలె సంచరించును. విభూతి రుద్రాక్షాది బాహ్యాడంబరములచే జంగముడు కానేరడు. శివజీవైక్యజ్ఞానముగలవాడే జంగముడని పిలువబడును. అతిశయమైన మార్గమునందు వర్తించువారు అనగా అతిశయమైన జ్ఞానసంపన్నులైనవారు జంగములని తెలుసుకొనవలెను. ఇట్టి జంగముడాణవాది మలసంబంధమును విడనాడి, దృశ్యమాన చరాచరాత్మక ప్రపంచమును శివ సంబంధము చేత చిత్క్రియా రూపముగలదైనదని తెలిసినవాడు, కామక్రోధములను జయించినవాడు, అభేద భావముగలవాడు, సత్పురుషుడైనవాడు, శత్రుమిత్రులందు ఏకభావము గలవాడు,

ప్రత్యక్షపర శివుడైనవాడు, ఆశాహంకార రహితుడైనవాడే శివయోగి కనుక ఇట్టి సద్గుణమండిత శివయోగియైన జంగమునే సదా సేవించుచుండవలెను

**4. భస్మము**

భస్మజాబాలోపనిషద్వచన ప్రకారము భస్మమనగా జ్యోతిర్లింగము. మానవులట్టి జ్యోతిర్లింగమయమైన భస్మధారణచేత శుద్ధాత్ముడగును. ఆభస్మము పరశివాపరనామ పరబ్రహ్మము. కనుక ఆజ్యోతిర్లింగస్వరూపముచేత ఉజ్వలించు చుండును. అందు వలననే దానికి భసితమని పేరుగలదు. ఆమహాభస్మము జ్యోతిర్మయ మహాదేవ స్వరూపమని భావించి ఏలింగధారులు వర్తించుదురో ఆశ్రేష్ఠులైన జనులు నిరుపాధిక భస్మధారులని పిలువబడుదురు. పంచబ్రహ్మ మంత్రన్యాసాది సంబంధములచేత శివమంత్ర సంస్కృతాగ్న్యాదులచేత ఏభస్మము జేయబడునో ఆభస్మము సోపాధిక భస్మమని శివాగమాభిజ్ఞులు తెలిపారు. ఈసోపాధిక భస్మము వేరేవేరే ఐదు కారణముల చేత విభూతి (అణిమాద్యష్ట విభూతి ప్రధానమైనది), భసిత (శివతత్వ ప్రకాశకరమైనది), భస్మ (మనోవాక్కాయక పాపభయోత్పాత భంగము కలిగించునది), క్షార (ఆధ్యాత్మికాది తాపత్రయాత్మక దుఃఖ విపన్నాశకరమైనది), రక్ష (గ్రహాది భీతుల నుండి రక్షించునది) అను పంచసార్ధక నామములతో ప్రసిద్ధిపొందింది. ఇట్టి పవిత్ర భస్మమును సర్వాంగములందు 'నమశ్శివాయ' అను పంచాక్షరీ మంత్రమును ఏడు సార్లు జపించి భస్మస్నానము (లేపనము) చేయవలెను. శిరస్సు, లలాటము, కర్ణములు, కంఠము, భుజములు, హృదయము, నాభి, వీపు, బాహువులు, పిరుదులు, మరియు మణిబంధములను పదిహేను స్థలములందు పంచాక్షర మూలమంత్ర పూరితమైన త్రిపుండ్రధారణ చేయవలెను. ఏపురుషుడు త్రికాలములందు భస్మత్రిపుండ్ర ధారణ చేయునో అతడు శివాచారసంపన్నుడై వేదత్రయీ స్వరూపుడై నిస్సంశయముగ శివస్వరూపుడే అగునని నమ్మవలెను.

**5. రుద్రాక్ష**

శివలింగ భస్మధారణ సంపన్నుడైన వీరశైవునిదేహమందు రుద్రచిహ్న ప్రకటనార్ధమై యేశివలాంఛనము ధరింపబడునో అదియే రుద్రాక్ష. అదియే శివైక్య మార్గమును పొందించునని శివాగమవచనమున కలదు. కావున రుద్రాక్ష ధారణ మత్యావశ్యకము. ఈరుద్రాక్షధారణచే జీవభావము వదలి శివైక్యభావము సిద్ధించు నని, అట్టి రుద్రాక్షధారి అనంతకోటిజీవులందు శివభావమునే గమనించునని,

చేతనాచేత వస్తువులందు భేదబుద్ధి లేనివాడని తెలియుచున్నది. అంతేకాక పంచాచారాలను అరువది నాలుగు శీలములను తనకు యోగ్యాచారాలని నడచువాడని, షట్స్థలజ్ఞాన మార్గగామియని బోధయగుచున్నది.

రుద్రుని మూడవదైన జ్ఞాననేత్రమునుండి రుద్రాక్షపుట్టినందున అది ధరించిన వాడు రుద్రసంబంధజ్ఞానము తెలిసినవాడని, సర్వత్ర రుద్రభావము గలవాడని, సగుణబ్రహ్మము గుణములనే పొందినవాడని అవగతమగుచున్నది. కావున ఈరుద్రాక్షధారణచే దుష్టులు, దురాచారులు, అజ్ఞానులు, తమపూర్వ పాపాచారము లను విడిచిన కాని రుద్రాక్షాధారణఫలము కలుగదు. ఉత్తముడైనను, అధముడైనను రుద్రాక్ష ధారణచే సర్వపాతక రహితుడై ముక్తిని పొందును. రుద్రాక్షధారణచే ప్రతిమనిషి సాక్షాత్తు శివుడేయగునని ఉపనిషద్వచనము చాటుచున్నందున ప్రతిమనిషి రుద్రాక్షను ధరింపవలెను. బ్రహ్మణాది వర్ణములందు బ్రహ్మచర్యాది ఆశ్రమములందు ఉత్తముడై యుండు వానికన్న భూతిరుద్రాక్షధారియైనవాడే ఉత్తముడని శాస్త్రములు కీర్తిస్తున్నాయి. భస్మము ధరించనివాని జన్మము నిరర్ధకమగునట్లు పుణ్యప్రదమైన రుద్రాక్ష ధరించనివాని జన్మము వ్యర్ధమగుచున్నదని అనేక ప్రమాణాలు కలవు.

**6. మంత్రము**

**నమశ్శివాయ** – ఇది పంచాక్షరి మంత్రము

**ఓం నమశ్శివాయ** – ఇది షడక్షర మంత్రము

**ఓం నమో మహాదేవాయ** – ఇది అష్టాక్షర మంత్రము

పంచాక్షరీమంత్రజపము శివకారుణ్యమును సంపాదించు ముఖ్య సాధనము; వేదవచనానుసారము శివశబ్దము సకల నిష్కల బ్రహ్మ ప్రతిపాదకమై సర్వాతిశయమై సర్వవేదానుసారియైనది. అట్టి శివశబ్దమే పంచాక్షరీమహామంత్రమందున్నందున ఈమంత్రమే సర్వోత్కృష్టమైనది. సర్వమంత్రోపమంత్రములు, వేదశాస్త్రములు పంచాక్షరీ మంత్రమునందుకలవు. ఈసర్వోత్కృష్ట పంచాక్షరి ఓంకారముచే కూడి షడక్షర మంత్రమగునని వేదాగములందు చెప్పబడినది. ఈపంచాక్షరీమంత్రము నిష్కళ పరమాత్ముని బోధించుచున్నది కనుక ఈమంత్రజపముచే మనస్సునందు శివస్వరూప, శివజ్ఞాన, శివాత్మైక్య స్వరూపములు స్థిరపడును. ఇతరులకు వినబడునట్లు ఉచ్చరింపబడు జపము వాచకమనియు, వినరాకుండా నోటియందుచ్చరించునది ఉపాంశువనియు, చిత్తమునందు ధ్యానించునది మానసికమనియు మూడు విధముల

జపములుగలవు. ఈత్రివిధజపములలో ఘోరసంసార నాశకరమైన మానసికజపమే శ్రేష్ఠమైనది. మలమాయాది పాశనివృత్తికై ఈపంచాక్షరీ జపయుక్తముగా శివలింగమును పూజింపవలెను. ఎవడు పంచాక్షరీమంత్రయుక్త పుష్పమును ఒక్కటియైనపెట్టి లింగమును పూజించునో అతనికి వాజపేయ యజ్ఞ సహస్రఫలము లభించును. ఓంకారసంయుక్త పంచాక్షరీపూరిత శివపూజచేత ఎంత పామరుడైనను పాపబంధముక్తుడై మోక్షసంపన్నుడు కాగలడు. తపోయజ్ఞవ్రతనియమములు పంచాక్షరి సమానములుకావు. కావున ప్రతివీరశైవుడు ఓంకారసంయుక్త పంచాక్షరీ మంత్రమును సర్వదా జపించుచుండుటయే శివధ్యానమనబడును. ప్రణవసహిత నమశ్శివాయ అనుమంత్రమే తారకమంత్రము. దీనిచే జీవులయొక్క ఉద్ధారముజరిగి, బ్రహ్మసాక్షాత్కారము కాగలదు. ఇదియే బ్రహ్మవిద్య. దీనితో జీవులకు బ్రహ్మజ్ఞానము కలుగును. ఈ తత్వజ్ఞానముచే ఆనందపూర్ణ బ్రహ్మముయొక్క ఆవిర్భావరూపమైన ముక్తిగలుగును.

### 7. పాదోదకము

వీరశైవులు తమలింగార్చన సమయంలో లింగమునకర్పించిన జలమును సేవించుదురు. ఇదియే పాదోదుకము. అన్యము పాదోదుకముగాదు. శివలింగ సారములో లింగమునకభిషేకము చేయించిన జలమే శివశరుణులకు పానయోగ్య మైనదికాని అన్యముగాదని స్పష్టముగ చెప్పబడినది. కనుక అట్టి లింగోదకమును సేవించుటవలనగలుగు ఫలాఫలములను విమర్శింపవలెను. ఈలింగోదకసేవనము వలన తాపత్రయములు నశించుచున్నవి. మరియు జ్వరాదివ్యాధులు హరించి పోవుచున్నవి. మృత్యుభయము నిర్మూలమగుచున్నది. ఉత్సాహము. పౌరుషము, సౌఖ్యము, శౌర్యము, సంతానము, అక్షయసుఖము, మరియు కాయశుద్ధి మొదలగునవి కలుగుచున్నవి. ఇట్టిలింగోదకమును పానముచేయువారికి పంచసూతకములు, అశచి భావనలేకుండునని అనేక వీరశైవ గ్రంథాలలో చెప్పబడినది. శూలరోగము, కుష్టురోగాదులు, అపస్మారాది జ్వరాదులు అన్నీ లింగాభిషేకము వలన హరించునని శివుడు బోధించియున్నాడు. శివపాదోదుక ధారణము సమస్త మంగళ వస్తువులలో మంగళకరమైనది. సమస్తపాప వినాశకరమైనది. సర్వసిద్ధులనిచ్చునది.

### 8. ప్రసాదము

శివప్రసాదముచేతనే చిత్తశుద్ధి కలుగును. వైరాగ్యముత్పన్నమగును. సకల పాపములు నాశనమగును. కనుక రుద్రార్పిత ప్రసాదమునే భుజించి రుద్రార్పిత

జలమునే సేవించి, రుద్రార్పిత ప్రసాదకుసుమమునే ఆఘ్రాణించవలయును. భక్తిసంపన్నుడైన పురుషుడు పూలు, పత్రి, నీరు, అన్నము మొదలైన సర్వవస్తువులను మొదట లింగార్పితము గావించి యీ వస్తువు నీదనియు, నీకృపతో ఇవ్వబడెననియు తత్ప్రసాదముచే కృతార్థుడనైతిననియు భుజించవలెను. రుద్రభుక్తాన్నమే అమృతము. ఆశివప్రసాదమునకై దేవతలు మరియు వేదములు కూడ ఆపేక్షించెదరని యజుర్వేద వచనము. కనుక గురులింగ జంగమాదుల ప్రసాదము అనగా వారి అనుగ్రహమనియే తెలియవలెను. సమస్త పదార్థములు రుద్రునిచేతనే కల్పింపబడినవి. రుద్రునిచేతనే మనకొసగబడినవి. కనుక రుద్రునికర్పించియే రుద్రభుక్తశేషాన్నమే సేవించిన ఆయురారోగ్య సంపన్నులై సకలైశ్వర్యములను పొందుదురు. ఈశుభ్రమైన ప్రసాదాన్నభుక్తము చేత దేహమునందలి సమస్తధాతువులు శుభ్రపడి అంతర్బహిరింద్రియములు నియమముగలిగి వర్తిల్లుచుండును. మనస్సు నిశ్చలమైనందున దుష్టసంకల్పములయందు ప్రవర్తింపక సద్బుద్ధినే కలిగించును. అహంకార, మమకారములు తగ్గును. సర్వత్రశివభావము వృద్ధిపొందును. సద్భావమువలనను శాంతిమయుడై శివైక్యప్రాప్తినిగాంచును. కనుక శివప్రసాదమునే సేవించవలెను. మరియు అతిథుల సత్కారము జేయవలెను. తద్వారా సర్వభూతదయాళుత్వము సిద్ధించును.

ఈఅష్టావరణాలను ఎనిమిది రక్షణలు భక్తునికి శారీరక మానసిక పవిత్రతను కలుగజేసి మాయాజాలమునుండి అతనికి విముక్తి ప్రసాదించును. అందువలననే వీరశైవుడు శివయోగి లేక శివశరణుడుగా పరిగణింపబడుచున్నాడు. సదా దేహమందు ధరించిన లింగమను జ్యోతిచే అతని మలినములన్నియు దహించబడుటవలన, మరణించిన తర్వాత మరల దహన సంస్కారమతనికి లేదు, ఖననమే విధించబడినది. మరియు పంచసూతకములు గూడాలేవు.

## షట్ స్థలములు

వీరశైవులకు పరమలక్ష్యమైన శివజీవైక్య సిద్ధినందుటకు తత్సాధన రూపకముగ భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములను షట్ స్థలములేర్పరచ బడినవి. కావున షట్ స్థల విధాన విజ్ఞానములు వీరశైవుల కావశ్యకములయివున్నవి. స్థలమనగా సామాన్యార్థమైన చోటు అనికాక జీవాత్మ పరమాత్మను చేరుటకు చేయు ప్రయాణములో ఒక దశ, సోపానము లేక మజలీ అను అర్థములో ఇచట

ప్రయోగింపబడినది. సిద్ధాంత శిఖామణి అను సంస్కృత గ్రంథమున ఇందుగూర్చి విశేషవివరణములు చెప్పబడియున్నవి. వీరశైవ సిద్ధాంతమునందు పరశివబ్రహ్మము "స్థల" మని చెప్పబడినది.

గురు,లింగ, జంగములను తారతమ్యముతో త్రిమూర్తులను పూజించువాడే భక్తుడు. గురూక్త మార్గ ప్రకారము లింగపూజయందు అత్యంత ప్రీతిగలవాడు, జంగమమూర్తులను అఖండ భక్తిచేత పూజించువాడు మాహేశ్వరుడనబడును. లింగముల కర్పించక మరియు లింగార్పితము గావించక భుజించకుండువాడు మరియు చరాచర లింగార్పితమును త్యజింపనివాడు ప్రసాది యనబడును. ప్రాణము నందును, లింగమునందును మరియు శివునియందును ఏకబుద్ధిగలవాడే ప్రాణలింగి యనబడును. దారేషణ, ధనేషణ, పుత్రేషణ అను ఈషణత్రయముల వదలినవాడు, ఏకాంతవాసము చేయువాడు, ఎల్లప్పుడు శివధ్యానమునందు నిరతుడైయుండువాడు శరణుడనబడును. పూజా, ధ్యాన, యోగాదులనువాటిని వదలి "అహం శివోహం" అను భావమున ధృఢమైనవాడే శివలింగైక్యుడనబడును. ఈషట్స్థలములు అతి రహస్యమైనవి. ఈషట్ స్థలజ్ఞుడు జన్మసంసారబంధమును వదలి పరమపదమును పొందును.

1. సాధకుడు ఆత్మార్పణమొనర్చి తనుమనోధనములు నిజగురునకు, శివభక్తులకు ఆధీనములని తలచు బుద్ధిని హెచ్చరించునది భక్తస్థలము. సదాచారము, శివుని యందు భక్తి, లింగజంగములందేకభావము, శివలాంఛనయందనురక్తి గలిగి యుండుటయే భక్త స్థల లక్షణములు.

2. "ఆత్మవత్సర్వభూతాని" అను న్యాయముతో సమస్త జీవరాసులను తనవలెనే భావించి, ఫలాపేక్షరహితముగా కర్మలొనర్పదగు ఆవశ్యకతను హెచ్చరించునది మాహేశ్వరస్థలము. అనగా పరస్త్రీని, పరద్రవ్యమును వర్జించుచు పరిశుద్ధ భావము గలవాడై లింగనిష్టయుక్తాత్ముడగుటయే మాహేశ్వర స్థలముయొక్క లక్షణము.

3. సమస్త పదార్థాలను ముందు శివార్పణమొనరించి, శివప్రసాదబుద్ధితో వాని గ్రహించుచు, తాను చేయు కర్మములన్నిటికి శివుడే కర్తయని, ఆతని ప్రేరణము లేనిదే తాను చేయునది లేదని, తలచెడి శివాధీనతను హెచ్చరించునది ప్రసాది స్థలము. లింగ మోహియై లింగార్పిత పదార్థాలను భుజించుచు లింగానర్పిత పదార్థము విడుచుటయే ప్రసాది స్థల లక్షణము.

4. తన ప్రాణము శివుని శక్తియేయని భావించి, మనస్సును ప్రాణలింగమందే లగ్నమొనరించుటను హెచ్చరించునది ప్రాణలింగిస్థలము. ఈస్థితిలో సాధకునకు శివయోగము(శివునితో కూడిక) చేకూరును. ప్రాణవాయువు గుణమునందు లింగమును భావించి లింగప్రాణ సమాహితుడై సుఖ దుఃఖములు రెండు లేనివాడై యుండుటయే ప్రాణలింగ స్థలము.

5. శివుడు పతియని, తాను సతినని, అతడు తప్ప వేరు శరణములేదని అనన్యమగు సతీభావముతోడ శివుని యెడవర్తిల్లు స్థితిని హెచ్చరించునది శరణస్థలము అనగా ఆత్మాంతర్యామియైన పరమాత్ముడు తానే లింగస్వరూపమైన మగడు, నేను భార్యనని లౌకికసుఖము లేనటువంటివాడే శరణ స్థలుడు. ఈస్థలమే ఉత్తమమైనది.

6. పూర్వోక్తములయిన పంచస్థల లక్షణములలో గడిదేరినంతనే సాధకునకు సమస్తము (తనతో సహితము) శివస్వరూపముగానే గోచరించునుగాని ఇంచుకేని భిన్నస్థితి మరేమియు కనిపించదు. హారతి ఇచ్చిన కర్పూరమువలె సర్వదగ్ధమయి స్వస్వరూపము నశించి శివైక్యముగలుగును. ఈదశను వివరించునదే ఐక్యస్థలము.

కనుక ఈషట్స్థల లక్షణయుక్తుడైనవాడే వీరశైవుడనబడును. క్రమసాధనవలన వీరశైవుడు శివైక్యస్థితిని సాధింపవలసియున్నది.

## షట్ కర్మములు

యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, పరిగ్రహములనునవే షట్కర్మములు.

1. శివార్చనము చేయుటయే యజనము.
2. శివార్చనము ఇతరులచే చేయించుటే యాజనము.
3. నిగమాగమముల అభ్యసించుటయే అధ్యయనము.
4. నిగమాగమములను ఇతరులకు బోధించుటయే అధ్యాపనము.
5. పాత్రాపాత్రములను తెలిసి ధనమును యిచ్చుటయే దానము.
6. యోగ్యులనుండి ధనము తీసుకొనుటయే పరిగ్రహము.

ఈషట్కర్మములందు యజన, అధ్యయన, దానములు మూడు మోక్ష సాధనములు. యాజన, అధ్యాపన, ప్రతిగ్రహములు మూడు జీవనసాధనములు. అనగా వీరశైవుడు ఈషట్కర్మలవలన ఇహపరముల రెండు సాధించును. ఇహమునందు సుఖము, పరమునందు మోక్షము సిద్ధించును. కనుక ఈశివాగమమోక్త అప్రాకృత కర్మములను వీరశైవులు జేయవలెను.

గర్భాదాన, పుంసవస, సీమంత, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌల, దీక్షా, వివాహ, అంత్యేష్ఠి అనునవే దశకర్మలు. మిగిలిన స్మార్తాగ్నిహోత్రాది ఆరుకర్మలు కూడి షోడశకర్మలనబడును. ఈకర్మలను వీరశైవులు ఆచరించరు. కేవల పుణ్యప్రదములైన జ్యోతిష్టోమ, అగ్నిష్టోమ, కృచ్ఛ, చాంద్రాయణ, పౌండరీక కర్మలు వేదోక్తములైనను వాటిని వీరశైవులు పరిత్యజింతురు.

## పంచపీఠాలు లేదా పంచమఠాలు

పంచాచార్యులు స్థాపించిన మఠాలు/ పీఠాలకు పంచపీఠములు లేదా పంచమఠాలని పేరు. అవి :

**1. శ్రీమద్రంభాపురి వీరసింహాసనపీఠము**

తథారేవణ సిద్ధ్య కొల్లిపాక పురోత్తమే
సోమేశలింగ జనన మావాసః కదలీపురే

రేవణసిద్ధాచార్యులు కొలనుపాకలో ఉన్న స్వయంభూసోమేశ్వరలింగం నుండి ఉద్భవించి **కదలిపురం** (బాలెహళ్ళి) లో **వీరసింహాసన పీఠాన్ని** స్థాపించాడు.

**2. శ్రీమదుజ్జయినీ సద్ధర్మ సింహాసనపీఠము**

తద్వన్మరులసిద్ధ్య వటక్షేత్రే మహత్తరే
సిద్దేశలింగే జననం స్థానముజ్జయినీపురే

మరుళసిద్ధశివాచార్యులు వటక్షేత్రంలోని సిద్ధేశ్వరలింగమునుండి ఉద్భవించి ఉజ్జయినిపురంలో సద్ధర్మ సింహాసనపీఠాన్ని స్థాపించి వీరశైవ మతాన్ని వ్యాప్తి చేసాడు.

**3. శ్రీహిమవత్కేదార వైరాగ్య సింహాసనపీఠము**

ద్రాక్షారామే రామనాథలింగే యుగచతుష్టయే
ఏకోరామస్య జనన మావాసస్తు హిమాలయే

ఏకోరామారాధ్యులు ద్రాక్షారామ రామనాథలింగం నుండి జన్మించి హిమాలయ పర్వతాలలో నివసించి వైరాగ్యసింహాసనపీఠాన్ని స్థాపించి వీరశైవులకు ఆరాధ్య గురువయ్యాడు.

**4. శ్రీశైల సూర్య సింహాసనపీఠము**

సుధాకుండాఖ్య సుక్షేత్రే లింగేశ్రీమల్లికార్జునే
జననం పండితారాధ్యస్య నివాసః శ్రీగిరే శివే

పండితారాధ్య శివాచార్యులు సుధాకుండమని పేరొందిన శ్రీశైలక్షేత్రంలో శ్రీమల్లికార్జునలింగం నుండి ఉద్భవించి అక్కడనే పీఠాన్ని స్థాపించాడు. ఈపీఠం మల్లికార్జునస్వామి భ్రమరాంబ ఆలయాలమధ్య **జగద్గురు పండితారాధ్యపీఠమనే** పేరుతో పిలువబడుతున్నది. ఈపీఠానికి **సూర్యసింహాసనపీఠమని** పేరు.

**5. శ్రీకాశీ జ్ఞాన సింహాసనపీఠము**

కాశ్యాం విశ్వేశ్వరే లింగే విశ్వారాధ్యస్య సంభవః
స్థానం శ్రీకాశీక్షేత్రశృణు పార్వతిసాదరం

కాశీలో ఉన్న విశ్వేశ్వరలింగం నుండి విశ్వారాధ్య శివాచార్యులు జన్మించి కాశీలోనే పీఠాన్ని స్థాపించాడు. ఈపీఠం **జంగమవాడిపీఠమనే** పేరుతో పిలువబడు చున్నది. ఈపీఠానికే **జ్ఞానసింహాసనమని** పేరు.

## వీరముష్టులు

దేవాలయాలను, మఠాల ఆస్తులను, హక్కులను రక్షించేవారు వీరముష్టులు. వీరిని వీరపురాంతకులు, వీరభద్రులు అని కూడా అంటారు. వీరముష్టులు జుంజుంను, కాసెను, వారసమును, మోటుపలకను పట్టెడివారని శాసనాలవలన తెలుస్తుంది. నెమలి ఈకలకట్టను జుంజు అంటారు. ఒకవైపు కొసలను విడిచిపెట్టి కట్టే దట్టీని కాసె అంటారు. నారసము అంటే బాణము. తప్పెటవంటి వాద్య విశేషం మోటుపలక. తాము వీరశైవ సిద్ధభిక్షావృత్తయ్యవారి శిష్యులమని ఆజ్ఞాధారులమని వీరముష్టులు కడపజిల్లా శాసనాలలో చెప్పుకున్నారు.

వీరముష్టులు వైశ్యులకు, బలిజవారికి ఆశ్రిత కులము వారని సిరాజ్, కోమటి, దేవాంగ కులావారి ఆశ్రితులని, థర్స్టన్‌లు అయాకులాల ప్రశస్తిని కీర్తించి తమ వీరవిద్యలను ప్రదర్శించి ఆరెండు కులములవారివద్ద నుండే భిక్షను స్వీకరిస్తారని తమగ్రంథాలలో తెలిపారు. అంతేకాక కొమట్ల ఇంట్లో వివాహము జరిగితే పెండ్లికుమారుని వద్దనుండి ఒక రూపాయి, పెండ్లికుమార్తె వారి దగ్గరనుండి ఎనిమిది అణాలు తమ మిరాశీగా/ వర్తనలుగా వసూలు చేసేవారు. ప్రసిద్ధ శివాలయాలు, మఠాల రక్షణకు ఒకరు లేదా ఇద్దరు వీరముష్టులు రక్షకులుగా ఉండేవారు. కాకతీయుల మల్కాపురం శాసనంలో కూడా వీరు మఠ రక్షకులుగాపేర్కొనబడినారు. మేదరి మఠము వర్షాశనపు దానపత్రికలో వీరముష్టులు మేదరి కులమునకు ఆశ్రితకులముగా చెప్పబడింది. ఈ అంశము ఇప్పటివరకు చరిత్రకారులకు తెలియని విషయము.

## నేబులు

నేబు అనగా కొన్ని నిఘంటువులు పన్నెండు కాసుల నాణెమని అర్థము చెబుతున్నాయి. కొన్ని నిఘంటువులు నేబు అనగా కొన్ని ప్రాంతాలలో ఒక కాసు అని మరికొన్ని ప్రాంతాలలో రెండు డబ్బులు అని వాడుకలో ఉన్నట్లు తెలుపుతున్నాయి. కాసు అనగా దుగ్గానిలో నాల్గవభాగము, దుగ్గానిలో పదోభాగమని కొందరు (శబ్దరత్నాకరము) కాసు అనగా దమ్మిడిలో ఐదవవంతు, నాల్గవ వంతని కొందరు (వావిళ్ళనిఘంటువు). ఒక డబ్బుకు ఇరవై కాసులు (తెనుగు-ఇంగ్లీషు డిక్షనరి) డబ్బు అనగా రెండు దుగ్గానుల రాగినాణెమని శబ్దరత్నాకరము, డబ్బు అనగా మూడు లేదా నాలుగు పైసల విలువుగల నాణెమని వావిళ్ళ నిఘంటువు వివరిస్తున్నాయి. 'పలువలు చెంతఁజేరియొక పాతికనేబులు చేతికిచ్చినన్' అని కూచిమంచి జగ్గకవి రచించిన చంద్రరేఖావిలాపము ద్వితీయాశ్వాసములో కలదు. నేబు అనే నాణెము ఎవరికాలమునుండి వాడుకలో వచ్చిందో, ఆ నాణెం స్వరూపము గురించి పరిశోధించాల్సిన అవసరం ఉన్నది.

### ఉపయుక్త గ్రంథాలు


Edgar Thurston : Castes and Tribes of Southern India, Vol.V, Madras,1909.

M.R.Sakhare: Lingadharanacandrika, Belgaum, 1942.

S.C. Nandimath: A Handbook of Virasaivism, Dharawar, 1942.

S.S.Vodeyar (Ed): Sri Basavesvara Eighth Centenary Commemoration Volume, Bangalore, 1967.

Syed Siraj Ul Hassan: The Caste and Tribes of H.E.H.Nizam's Dominions, Bombay, 1920.

అద్దేపల్లి కృష్ణశాస్త్రి : శివార్చన, కాకినాడ,1974.

కూచిమంచిజగ్గకవి : చంద్రరేఖావిలాపము

కె.ఎం.రుద్రప్ప : శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణి, హైదరాబాదు, 1938.

కెల్లా పరమేశ్వరప్ప : వీరశైవ సాహిత్యము సమతా దృక్పథము, అనంతపురము, 1991.

తిమ్మావఝుల కోదండరామయ్య : పాల్కురికి సోమనాథుడు-వీరశైవ సిద్ధాంతము, తిరుపతి, 1968.
తిరుమలనాథ కవి : శైవాచార సంగ్రహము, మద్రాసు, 1951.
నూతికట్టు కోటయ్య : బసవేశ్వర చరిత్రము, కాకినాడ,1975.
మల్లికార్జున పండితారాధ్య : శివతత్వసారము, చెన్నపురి, 1922.
పెద్దమఠము రాచవీరదేవర(అను) : ప్రాచీన వీరశైవము, హైదరాబాదు, 1987.
పెద్దమఠము రాచవీరదేవర : వీరశైవ పురోహితం, హైదరాబాదు,1991.
పెద్దమఠం రాచవీర దేవర (అను) : శ్రీసిద్ధాంత శిఖామణి, శ్రీశైలం,2000.
బండారు తమ్మయ్య : వీరశైవ దర్శనము, కాకినాడ, 1959.
రేకళిగెమఠము వీరయ్య : బసవ వచనామృతము, సికింద్రాబాదు, 1941.
విరివంటి గోపాలకృష్ణ : కొలనుపాక చరిత్ర-శాసనాలు, కొలనుపాక, 1998.
విరివంటి గోపాలకృష్ణ : కొలనుపాక దేవాలయాలు, కొలనుపాక, 2006.

# మేదరిపురాణం

మేదరిమఠం నాగేంద్రయ్య
మేదరిమఠం ప్రవీణ్ స్వామి

ఓం నమశ్శివాయ
పరమ్వేరుని జననం
ఓం కారం ప్రణవం దేవం

ఒకానొక సమయంలో ఈ సృష్టియందు ఓంకారం శబ్దంలో ఒక ఆదిశక్తి జన్మించెను. ఆ శక్తి శంఖ, చక్ర, గదా, త్రిశూలం, త్రినేత్రం, హస్తస్పర్శము కలిగి ఉండెను. అప్పుడు ఆ ఆదిశక్తి తనకి తోడుగా భర్త కావాలని అనుకొనెను. ఆ సమయములో తనకు ఎటు చూసిన ఎవరు కనిపించలేరు. ఆసమయమున శక్తి సాత్విక, రజో, తామస అను మూడు గుణములు కల్గివుండెను. తన యందుఉన్న సాత్వికముతో నాకు తగిన భర్త జన్మించుగాక అని కోరుకొనెను. తన హస్తస్పర్శ ద్వారా ఒక పురుషుడు జన్మించెను. అతడే బ్రహ్మ. అప్పుడు బ్రహ్మ ఆదిశక్తితో "తల్లీ! నన్ను పుట్టించుటకు కారణం ఏమి?" అని అడిగెను. అపుడు శక్తి "ఓ బ్రహ్మా! నాకు తగిన భర్త కావాలనే కొరికతో నిన్ను పుట్టించితిని. కాని నీవు నన్ను తల్లి అని పిలిచితివి కాన, నీవు నాకు పుత్రుడితో సమానం. పుత్రుడితో భోగించుట పాపం కదా!" అని పలికి బ్రహ్మను భస్మం చేసెను. పిమ్మట ఆదిశక్తి తనయందు ఉన్న రజోగుణముతో నాకు తగిన భర్త జన్మించు గాక! అని కోరుకొనెను. తన హస్తస్పర్శ ద్వారా మరియొక పురుషుడు జన్మించెను. అతడే విష్ణువు. అపుడు విష్ణువు ఆదిశక్తితో "అమ్మా! నన్ను ఎందుకు పుట్టించితివి?" అని అడుగగా ఆ శక్తి విష్ణువుతో "ఓ విష్ణుమూర్తి! నాకు తగిన భర్త కావాలనే కోరికతో నిన్ను పుట్టించితిని. కాని, నీవు నన్ను అమ్మా అని పిలిచితివి కాన, నీవు నాకు మనవడితో సమానం. కావున నేను నిన్ను వివాహం చేసుకొనుట మహా పాపం కదా!" అని పలికి విష్ణువును భస్మం చేసెను. ఆ తర్వాత తనయందున్న తామసముతో నాకు తగిన భర్త జన్మించు గాక! అని కోరి తన హస్తము మోపగా రౌద్రాకారముతో ఒక పురుషుడు జన్మించెను, అతనే శంకరుడు. అపుడు శంకరుడు రౌద్రాకారుడై ఆదిశక్తితో "ఏమే! నన్నెందులకు పుట్టించితివి," అని అడుగగా ఆ శక్తి "ఓ శంకరా! నాకు తగిన భర్త కావాలనే ఆశతో

నిన్ను పుట్టించితిని", అనగా అపుడు శంకరుడు "సరే! కాని, ఆచట వున్న బూడిదరాశులు ఏమిటి?" అని అడిగెను. అపుడు ఆదిశక్తి శంకరునితో "శంకరా! నేను నాకు తగిన భర్త కావాలనే కోరిక వలన సాత్వికముతో బ్రహ్మను, రజోగుణముతో విష్ణువును పుట్టించితిని. కాని బ్రహ్మ నన్ను తల్లీ అనియు, విష్ణువు అమ్మ అనియు పిలిచి నన్ను వారిని వివాహం చేసుకోకుండా చేసినారు. అందువల్ల నేను వారిరువురిని భస్మం చేసితిని, అలాగే తామసముతో నిన్ను పుట్టించితిని. నీవు మాత్రం 'ఏమే' అని పిలిచితివి కావున నీవు నన్ను వివాహం చేసుకొనవలెను" అని పలికెను. అటు తదుపరి శంకరుడు ఆలోచించి "దేవీ! నన్ను ఎవరైనా చంపినచో మరలా నీవు ఒంటరివే కదా! మరెలా?" అని అడుగగా ఆపుడు ఆదిశక్తి శంకరునితో "ఎవరిచే నీకు మరణం సంభవించదు." అని దీవించెను. శంకరుడు ఆదిశక్తితో "దేవీ యుద్ధములో నన్ను నేను కాపాడుకొనుటకు నా వద్ద ఎటువంటి ఆయుధములు లేవు కదా! కావున నీ దగ్గర వున్న శంఖ, చక్ర, గదా, త్రిశూలము, త్రినేత్రము ధారపోయుము." అని అడిగెను. అప్పుడు ఆదిశక్తి శంకరునితో "శంకరా! ఈ ఆయుధములు నీ వద్ద వున్నా నా వద్ద వున్నా ఒకటే" అని పలికి తన ఆయుధములను, హస్తస్పర్శను శంకరునికి ధారపోసెను. మరల శంకరునితో "స్వామీ! నీకు ఇంకా ఏమైనా కావలయునా?" అని అడుగగా శంకరుడు ఆదిశక్తితో "నీయందు వున్న శక్తిని ధారపోయుము" అని అడిగెను. అపుడు ఆదిశక్తి సంతసించి శంకరునికి తనశక్తిని ధారపోసెను. ఆలా తన శక్తిని ధారపోసిన పిదప ఆదిశక్తి వృద్ధురాలిగా మారెను. ఆ తర్వాత శంకరుడు ఆలోచించి తన హస్తమును ఆ బూడిద రాశులపై మోపగా ఆ బూడిద రాశులు తిరిగి యథారూపమై బ్రహ్మ విష్ణువులుగా మారిరి. ఆపుడు శంకరుడు ఆదిశక్తితో "ఓ శక్తి! నీవు మమ్ములను నీకు తగిన భర్త కావాలనే కోరికతో పుట్టించితివి కదా! కావున మా ముగ్గురికి నీవు భార్యగా కావలెను" అని అనగా అపుడు ఆదిశక్తి శంకరునితో "శంకరా! ఈ వృద్ధాప్యంలో మీ ముగ్గురికి నేను ఎలా భార్యను కాగలను?" అని అనగా శంకరుడు తన త్రినేత్రంతో శక్తిని భస్మంచేసి ఆ బూడిదను మూడు కుప్పలుగా చేసి తన హస్తమును ఆ కుప్పలపై మోపి 'దివ్య స్వరూపులై జన్మించుగాక!' అని దీవించగా మొదటి కుప్పయందు సరస్వతిదేవి, రెండవ కుప్ప నుండి లక్ష్మీదేవి, మూడవ కుప్పయందు పార్వతిదేవి జన్మించెను. బ్రహ్మ సరస్వతిదేవిని, విష్ణువు లక్ష్మీదేవిని, శంకరుడు పార్వతిదేవిని వివాహమాడిరి.

ఆ తర్వాత సత్యలోకమున బ్రహ్మ సరస్వతి, వైకుంఠమందున విష్ణువు లక్ష్మి, కైలాసమందున పార్వతి పరమేశ్వరులు సింహాసమున ఆసీనులై వుండిరి. శంకరుడు సృష్టి కర్తయై, దేవాధిదేవులను, దేవగణములను, మునిగణములను, రాక్షస గణములను పుట్టించెను. సకల కోటి జీవరాశులను సృష్టించెను. బ్రహ్మ లిఖిత కారకుడిగా, విష్ణువు లయకారకుడిగా వారి వారి కర్తవ్యములను నిర్వహించుచుండిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు త్రిమూర్తులుగా దేవగణాలచే, మునీశ్వరులచే పూజలందుకొనిరి.

**సర్వేజనా సుఖినోభవంతుః**

# కేతేశ్వర ఉద్భవం

త్రేతాయుగములో శ్రీపార్వతీపరమేశ్వరులు కైలాసమందు కొలువై కూర్చున్న సమయమందు మునీశ్వరులు పార్వతీపరమేశ్వరులను ప్రతి దినము పూజించేవారు. మునీశ్వరులలో భృంగి అను మునీశ్వరుడు శివుడిని మాత్రమే పూజించి పార్వతి దేవిని పూజించేవాడు కాదు. అట్టి సమయమందు పార్వతిదేవి శంకరుడితో "స్వామీ! అందరు మనలిద్దరిని పూజిస్తున్నారు కదా! కాని ఈ భృంగీశ్వరుడు మిమ్ములను మాత్రమే పూజించి నన్ను ఎందుకు పూజించడం లేదు." అని అడుగగా పరమేశ్వరుడు పార్వతి దేవితో "దేవీ! భక్తులు నిన్ను పూజించినా నన్ను పూజించినా ఒకటే కదా!" అని చెప్పెను. అప్పుడు పార్వతిదేవి పరమేశ్వరునితో "ఓ స్వామి! అయితే మిమ్మల్ని పూజించడం మాని నన్ను పూజించమని ఆజ్ఞ ఇవ్వుము" అని పలికెను. అపుడు పరమేశ్వరుడు పార్వతి దేవితో "ఓ దేవి! నేను భృంగితో నిన్ను పూజించమని చెప్పిన యెడల తాను చేస్తాడా! కావున, నీవు అతడినే అడిగి తెలుసుకొమ్ము" అని పలికెను. అప్పుడు పార్వతిదేవి భృంగీశ్వరుడితో "కుమారా! నన్ను పూజింపకపోవడానికి కారణం ఏమిటి?" అని అడుగగా భృంగీశ్వరుడు పార్వతిదేవితో "ఓ తల్లీ! శివుడిని తప్ప వేరెవరిని నేను పూజింపను" అని అనగా వెంటనే పార్వతిదేవి భృంగీశ్వరుడితో కుమారా నేను నా గర్భమునందు నిన్ను నవమాసములు మోసితిని కాన నీవు నాకు పుత్రుడివై జన్మించితివి కదా! నా యొక్క క్షీరములు ధారపోసి, పెద్దచేసి తదనంతరము నీకు విద్యాజ్ఞానం ధారపోసితిని. అయినా నన్ను పూజింపకుండా వుండుటకు గల కారణమేమి?" అని అడిగెను అప్పుడు భృంగీశ్వరుడు దేవితో "ఓ తల్లీ! నాకు జన్మ

ఇవ్వమని నిన్ను ఎప్పుడైన అడిగానా! అలాగే ఇదంతయూ నీ యొక్క భ్రమ మరియు ప్రేమ వలనే కాని, నాకు మోక్షపదవిని ప్రసాదించేది నాతండ్రి పరమేశ్వరుడే కాన నీతో నాకు పనియేమి?" అని అనగా అప్పుడు పార్వతీ దేవి అతి కోపంతో "భృంగీశ్వరా! నన్ను పూజించని యెడల నీయందున్న నాశక్తి ఎందుకు? కావున, నాశక్తి నాకు ఇవ్వుము" అని పలికెను. అపుడు మునీశ్వరుడు "నీ శక్తి ఏమిటి అని?" అడుగగా అప్పుడు పార్వతీదేవి "నాశక్తి నీ దేహమందున్న నా రక్త మాంసములే" అని చెప్పింది. అపుడు భృంగీశ్వరుడు దేవితో " అలాగా! అయితే నీరక్తమాంసములు నీవే తీసుకొనుము" అని చెప్పగా వెంటనే పార్వతీదేవి శక్తిరూపం దాల్చి అతని శరీరంలో వున్న రక్తమాంసములను పీల్చివేసింది. తదుపరి ఆ భృంగీశ్వరుడు అచ్చోటనే శక్తిహీనుడై అస్థిపంజరం వలె కుప్పకూలెను. ఇదంతయు పరమేశ్వరుడు తన దివ్యదృష్టితో గ్రహించుచు పార్వతీదేవి రాకకై వేచి ఉండెను. ఆ సమయమందే పార్వతీదేవి కైలాసము చేరి, అచట సింహాసనము అధిష్ఠించిన పిదప పరమేశ్వరుడు పార్వతీదేవితో "దేవీ నీవు నీశక్తిని భృంగీశ్వరుని నుండి ఎందులకు తీసుకున్నావు?" అని అడుగగా దేవి పరమేశ్వరుడితో "భృంగీశ్వరుడు నన్ను పూజింపని యెడల నాశక్తి తన దేహమందు ఎందులకు. అందుకే నేనలా చేశాను. అతడు అటులనే జీవించుగాక!" అని సమాధానమిచ్చెను.

ఆ సమయమందు భక్తులు పూజ కొరకు కైలాసమునకు చేరగా భృంగీశ్వరుడు మాత్రం ఇంకను రాకపోగ పరమేశ్వరుడు విచారించి తన దివ్య దృష్టితో చూడగా భృంగీశ్వరుడు శక్తిహీనుడై తపస్సు చేయుచుండెను. వెంటనే పరమేశ్వరుడు భృంగీశ్వరుని ఎదుట ప్రత్యక్షమై భృంగీశ్వరిడితో "భృంగీశ్వరా! నీవు ఎందులకు ఈ తపస్సు చేయుచుంటివి" అని అడుగగా భృంగీశ్వరుడు పరమేశ్వరుడితో "స్వామీ నేను మిమ్ములను మాత్రమే పూజించి దేవిని పూజించటంలేదనే కోపంతో దేవి నన్ను ఇలా శక్తిహీనుడిని చేసెను" అని పలికెను. పిమ్మట శివుడు భృంగీశ్వరుడితో "నీవు కైలాసమునకు వచ్చి నాకు పూజ చేసే శక్తిని నీకు ఇస్తున్నాను" అని చెప్పి కైలాసమునకు బయలుదేరెను. మరుసటిరోజున మునీశ్వరులంతా యధాప్రకారం కైలాసమునకు చేరుకొని పార్వతీపరమేశ్వరులకు పూజ చేసిన తర్వాత భృంగీశ్వరుడు కైలాసమునకు వచ్చి ఎప్పటిలాగే పరమేశ్వరుడిని మాత్రమే పూజించి తిరిగి వెళ్ళిపోయాడు. అలా కొన్ని రోజులు గడువగా పార్వతీదేవి మళ్ళీ శివుడితో "స్వామీ! నేను కోపముతో తనని

శక్తిహీనుడిని చేసినా, తాను మారక మళ్ళీ మీకు మాత్రమే పూజ చేసి నాకు మాత్రం పూజ చేయడం లేదు. మీరు మాత్రం ఏమి అనకుండా చూచుచున్నారు. మీకు నేను కావాలా! భృంగీశ్వరుడు కావాలా"! అని ప్రశ్నించెను. అప్పుడు పరమేశ్వరుడు ఏమి అనక తపస్సులో నిమగ్నమై వున్నారు. అప్పుడు పార్వతీదేవి కోపంతో కైలాసమును వీడి అరణ్యమునకు వెళ్ళెను.

ఆ అరణ్యములో పార్వతీదేవి చంచలమైన మనస్సుతో బాధతో వుండ సాగెను. కొన్ని సంవత్సరాల తర్వాత ఒక రోజు రాత్రి పార్వతీదేవి ఒక వటవృక్షం క్రింద దుఃఖించుచుండగా త్రిలోక సంచారియైన నారదముని ఆ అరణ్యములో సంచరించుచు ఆ రోదనను విని అటువైపు వెళ్ళసాగెను. వెంటనే నారదుడు పార్వతీదేవి వద్దకు వెళ్ళి పార్వతీదేవితో "ఓ దేవీ! మీరు కైలాసమందున పరమేశ్వరునితో ఆసీనురాలివై భక్తుల కోరికలు తీర్చేదానివి కదా! మీకు ఈ అరణ్యమున ఇలాంటి దుస్థితి ఎలా వచ్చింది తల్లీ!" అని పలికెను.

అప్పుడు పార్వతీదేవి నారదునితో "భృంగీశ్వరుడు అను మునీశ్వరుడు పరమేశ్వరున్ని మాత్రమే పూజించి నన్ను పూజింపక అవమానపరిచినాడు. ఇదంతయు గమనించుచున్న స్వామి కూడ ఏమియు పట్టించుకొనక తపస్సులో నిమగ్నమై వున్నాడు. కావున, ఆ కోపంతో నేను పరమేశ్వరుడిమీద అలిగి కైలాసము వీడి అరణ్యమునకు వచ్చితిని" అని చెప్పెను. అప్పుడు నారదుడు పార్వతీదేవితో "తల్లీ మీరు ఇలా అరణ్యములలో కష్టాలు పడలేరు కావున, కైలాసానికి తిరిగి వెళ్ళుము" అని అనగా పార్వతీదేవి నారదునితో "నారద మునీంద్రా! నేను పరమేశ్వరుడిపై అలిగి వచ్చితిని కదా! ఎలా నేను కైలాసానికి తిరిగి వెళ్ళగలను? నా స్వామి వచ్చి నన్ను తీసుకెళ్ళినప్పుడే నేను వెళ్తాను" అని అనగా నారదుడు పార్వతీదేవికి ఒకసలహా ఇచ్చెను. ఆ సలహా ఏమిటనగా "మీరు తపస్సు చేసిన యెడల శివుడు వచ్చి మిమ్ములను తీసుకెళ్ళగలడని" చెప్పెను. అప్పుడు పార్వతీదేవి "ఓ నారదా! నేను తపస్సు చేయలేను" అని పలికెను. అప్పుడు నారదుడు "తపస్సు చేయలేనప్పుడు వ్రతము వల్లనైన శివుడి మెప్పు పొందవచ్చును" అని చెప్పగా పార్వతీ దేవి వెంటనే "ఆ వ్రతము ఎలా చేయవలెను?" అని నారదుడిని అడిగెను. అప్పుడు నారదుడు పార్వతీదేవితో "ఓ దేవీ! ఆవ్రతమును 'కేదారేశ్వర వ్రతము' అను నామముతో పిలిచెదరు. ఆ వ్రతమును ఎలా చేయాలి అంటే ప్రాతఃకాలముననే లేచి ఉత్తరేణి పుల్లలతో దంతధావనం చేసి

మంగళస్నానం ఆచరించి 21 పోకలు, 21 బూరెలు, 21 తమలపాకులు, 21 ఖర్జూరాలు, 21 కుంకుమ ఉండలు, 21 పసుపు ఉండలు, 21 భస్మం ఉండలు, 21 గంధపు ఉండలు, 21 సువర్ణ పుష్పములు, 21 పూలదండలు, 21 మర్రి ఊడలు, 21 మర్రి పండ్లు, 21 ఆకులు కల్గిన ఇస్త్రారిలతో 21 రోజులు వ్రతము గావించవలెను. పంచామృతములచే అభిషేకము చేయవలెను. వ్రతం అయిన పిమ్మట ఇరవై ఒక్క మందికి వాయినం ఇవ్వవలెను. ఇలా ఎవరైతే వ్రతము చేసెదరో వారికి వర ప్రసాదము లభించును. మీరు ఈ వ్రతము చేసిన యెడల పరమేశ్వరుడు వచ్చి మిమ్ములను కైలాసానికి తీసుకొని వెళ్ళును." అని చెప్పెను. అప్పుడు పార్వతీదేవి నారదునితో "నారదా ! నేను ఈ వ్రతము తప్పకుండా ఆచరిస్తాను. నీవు ఇచ్చటనే వుండుము, నేను వెళ్ళి పూజకు కావల్సిన పూజా సామాగ్రిని తీసుకు వస్తాను." అని చెప్పి బయల్దేరెను. పార్వతీదేవి అరణ్యములో వ్రతమునకు కావల్సిన పూలు, పండ్లు, వివిద పూజా సామాగ్రి తీసుకొని తిరిగి వటవృక్షము వద్దకి వచ్చి ఆ సామాగ్రిని వ్రతము కొరకు సమకూర్చుచుండగా నారదునితో "ఓ నారదా! నాకొక సందేహం వచ్చినది. అది ఏమనగా! కేదారేశ్వర వ్రతము అనేది దంపతులు కలిసి చేసే వ్రతమా? లేక ఒక్కరు మాత్రమే చేసేదా? ఈ నా సందేహాన్ని నివృత్తి చేయగలరు" అని కోరెను. అప్పుడు నారదుడు పార్వతీదేవితో "ఓ పార్వతీదేవీ ఈ వ్రతమును దంపతులిద్దరు కలిసి చేయవలెను." అని చెప్పగా పార్వతీదేవి నారదునితో "నేను నా స్వామి గురించే కదా ఈ వ్రతము చేయదలుచుకుంది! మరి నా స్వామి లేకుండా నేను ఎలా ఈ వ్రతము ఆచరించగలను" అని అనగా అప్పుడు నారదుడు పార్వతీదేవితో "దేవీ! నేను వ్రతము గూర్చి దానిని ఆచరించే విధానమును గూర్చి మాత్రమే తెలియజేయగలను. కాని, మీ భర్తను రప్పించుకొనే బాధ్యత మీదే తల్లి" అని చెప్పెను. అప్పుడు పార్వతీదేవి కోపంతో "నారదా! నీవు చెప్పడం వల్లనే నేను ఈ వ్రతమాచరించడానికి సిద్ధమైతిని, కావున నేను ఈ వ్రతమును భంగపరచలేను. అందువల్ల పరమేశ్వరుడిని తీసుకొచ్చే బాధ్యత నీదే! లేని యెడల నీకు శాపం ఇచ్చెదను" అని చెప్పెను. వెంటనే నారదుడు శాపం ఇచ్చుననే భయంతో పార్వతీదేవితో "అలాగే తల్లీ! నేను పరమేశ్వరుడిని తీసుకొచ్చెదను" అని వాగ్దానం చేసి బయలుదేరెను. అలా నారదుడు మొదట వైకుంఠముకు వెళ్ళి జరిగినదంతా విష్ణుమూర్తికి అలాగే సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మ దేవునికి వివరించెను. అప్పుడు బ్రహ్మ, విష్ణువులు ఒక

ఉపాయము ఆలోచించి నారదుడికి చెప్పారు. వెంటనే నారదుడు దేవాది దేవతలు, మునీశ్వరుల వద్దకు వెళ్ళి "సమస్త దేవతలారా! పార్వతీదేవి అరణ్యములో కేదారేశ్వర వ్రతము ఆచరించుచున్నది. ఆ వ్రతమునకు సమస్త దేవతలను ఆహ్వానించినది. కావున అందరూ తప్పక రావసినదిగా, వచ్చినచో వరములు రానిచో శాపములు" అని చెప్పెను. వెంటనే దేవాదిదేవతలు, మునీశ్వరులు వ్రతమునకు వెళ్ళకపోతే శాపము ఇచ్చుననే భయంతో వస్తామని చెప్పిరి. తర్వాత బ్రహ్మ, విష్ణువులు, నారదుడు, సమస్త దేవతలు కలిసి కైలాసమునకు చేరిరి. కైలాసములో ఆసీనుడై వున్న పరమేశ్వరునితో నారదుడు "స్వామీ! సత్యలోకం మరియు వైకుంఠమునకు వెళ్ళిన లేని సంతోషం మాకు ఈ కైలాసమునకు వచ్చిన వెంటనే కలుగును. కాని, తల్లి లేని ఈ కైలాసంలో మాకు ఎటువంటి సంతోషం లేదు స్వామి" అని అనెను. అప్పుడు పరమేశ్వరుడు నారదునితో "నారదా! పార్వతీదేవి ఎచట వున్న నేను తీసుకొని వస్తాను" అని పలుకగా నారదుడు పరమేశ్వరునితో "పరమేశ్వరా ఇప్పుడు పార్వతీ దేవి అరణ్యములో కేదారేశ్వర వ్రతము ఆచరించు చున్నది కావున తల్లి ఇచటకు రాలేదు" అని అనగా వెంటనే పరమేశ్వరుడు నారదునితో "నారదా! మరి నేనెలా పార్వతీదేవిని తీసుకురాగలను" అని అడుగగా నారదుడు పరమేశ్వరునితో "ఓ స్వామీ! పార్వతీదేవి కేదారేశ్వర వ్రతము ఆచరించుచున్నది కాన పార్వతీదేవి అందరిని ఆహ్వానించుచున్నది. మీరు కూడా ఆ వ్రతమునకు రాగలరు. వ్రతమునకు వచ్చినచో వరములు రానిచో శాపములు" అని చెప్పెను. వెంటనే పరమేశ్వరుడు శాపము పొందుటకన్నా వరము పొందుట మేలు అని అనుకొని వ్రతమునకు వెళ్ళుటకు అంగీకరించెను. అచట నుండి నారదుడు దేవాదిదేవతలను, బ్రహ్మ, విష్ణ, మహేశ్వరులను, మునిగణాలను తీసుకొని అరణ్యానికి వెడలెను. అట్టి సమయానికే కొద్ది రోజులు గడిచినందున పార్వతీదేవి నిరాశతో వుండెను. ఆ సమయములో తనవైపు వస్తున్న దేవాదిదేవతలను చూసి ఆనందపడెను. కాని వెంటనే మనసులో కలత చెంది తనలో తాను "శాపభయముతో నారదుడు పరమేశ్వరుడిని సకల దేవతలను తీసుకొని వచ్చాడు. కాని వారికి చేయవలసిన మర్యాదలు చేయలేని స్థితిలో వున్నాను." అని కలవరపడుతు విచారించెను. వెంటనే తనలో తాను నాకు నా పరమేశ్వరుడే దైవం అనుకొని మనసులో పరమేశ్వరుడిని ధ్యానం చేసెను. అంతట పరమేశ్వరుడు ఆధ్యానానికి పరవశుడై "మనోవాంఛ ఫల సిద్ధిరస్తు" అని

దీవించెను. వెంటనే పార్వతీదేవి పరమేశ్వరుడిని "హస్తస్పర్శ" ఇవ్వమని కోరెను. దానితో పరమేశ్వరుడు ప్రసన్నుడై శ్రీఘ్రమే వరప్రసాదము ఇచ్చెను. ఆటు పిమ్మట పార్వతీదేవి ఆ వరముతో పన్నెండు ఆమడ వరకు మెట్ట మైదానములు మరియు ఆచట దేవాదిదేవులకు వజ్ర సింహాసనములు ఏర్పాటు చేసెను. అలాగే పార్వతీదేవి స్వరూపముతో పన్నెండుమంది స్త్రీలు ఉద్భవించేలా చేసెను. తదుపరి పార్వతీదేవి పరమేశ్వరునికి ఎదురుగా వెళ్ళి పాదపూజ చేసి సింహాసనంబున ఆసీనులు అవ్వమని చెప్పి పరమేశ్వరునితో "స్వామీ! వ్రతమునకు కావల్సిన అన్ని వస్తువులు సమకూరాయి. కాని వాయినం ఇవ్వడానికి కావలసిన వస్తువులు నా దగ్గర లేవు" అని అనెను. అప్పుడు పరమేశ్వరుడు పార్వతీదేవితో "ఆ వస్తువులు ఏమిటి?" అని అడుగగా పార్వతీదేవి పరమేశ్వరునితో "ఆ వస్తువులు కట్టెచాట, మట్టికుండ, కావున ఆ వస్తువులు మీరే నాకు తయారు చేసి ఇవ్వవలెను. ఎందుకనగా ఇచట మట్టికుండ, కట్టె చాట తయారుచేయువారు లేరు అని అనెను. అపుడు పరమేశ్వరుడు ఆలోచించి చూడగా ఆచట కట్టెచాట, మట్టికుండ తయారు చేయువారు లేరు అని గ్రహించి తాను తపోనిష్ఠలో కూర్చున్నాడు. అట్టి సమయమునందు కుడి పాదంబున "కుమ్మరి గుండయ్య" మరియు ఎడమ పాదంబున "మేదరి కేతయ్య" అను ఇద్దరు భక్తులు ఉద్భవించిరి. వారు మెడయందు లింగము మరియు రుద్రాక్షమాల, నుదిటిన విభూతి రేఖలు ధరించినవారై శివ పంచాక్షరిని పఠిస్తూ పరమేశ్వరుని ఎదుట నిలబడిరి. తదుపరి పరమేశ్వరునికి సాష్టాంగ వందనములు చేసి పరమేశ్వరుడితో "స్వామీ! మమ్ములను పుట్టించిన కారణమేమిటి?" అని అడుగగా అప్పుడు పరమేశ్వరుడు "కుమారులారా! పార్వతీదేవి కేదారేశ్వరవ్రతము చేయుచున్నది. వ్రతం అనంతరం వాయినము ఇచ్చుటకు కావలసిన వస్తువులు లేని కారణంగా ఆ వస్తువులను మీచే తయారు చేయించుటకు మిమ్ములను పుట్టించితిని" అని చెప్పెను. అప్పుడు ఆ భక్తులు ఆ వస్తువులు ఏమిటి? అని అడుగగా పరమేశ్వరుడు "ఆ వస్తువులు కట్టెచాట, మట్టికుండ" అని చెప్పెను. అప్పుడు కుమ్మరి గుండయ్య పరమేశ్వరుడితో "స్వామీ! కుండ అనగా ఏమి? దానిని ఎలా తయారు చేయవలెయును? దాని తయారీకి కావాల్సిన సామాగ్రి ఏమిటో తెలియజేయగలరు" అని అడిగెను. అప్పుడు పరమేశ్వరుడు తన దగ్గరవున్న చక్రము, త్రిశూలము, కపాలము మరియు వీరముద్ర ఇచ్చెను. అటులనే తన శరీరము నుండి మట్టిని ఇచ్చి కుమ్మరి గుండయ్యతో "ముందుగా

మట్టిని తొక్కి ముద్దగా చేసి ఆ ముద్దను చక్రముపై పెట్టి త్రిశూలమును కట్టెగా మార్చి ఆ యొక్క కట్టెను చక్రముపై వుంచి కపాలమును నీటితొట్టిగా మార్చి అందులోని నీటిని అద్దుతూ కుడి చేయిని మట్టి లోపల ఎడమ చేయిని మట్టి వెలుపల వుంచి గుండ్రంగా తిప్పవలెను. అలా తిప్పగా రెండు చేతుల మధ్య వచ్చే ఆకారమే కుండ. ఆ కుండని తీసి వీరముద్రచే దగ్గరగా అని దానిని తొమ్మిది రోజులు అరబెట్టవలెను. అప్పుడు ఆ కుండను అగ్నిలో కాల్చి, ఆ కాలిన కుండను మూడు సార్లు చేతితో కొట్టగా "ఓం" అనే నాదం వినిపించును. అప్పుడు నాకు ఆ కుండను ఇవ్వుము" అని చెప్పెను. తర్వాత కుమ్మరి గుండయ్య ఆలాగే చేసి ఆ కుండను పరమేశ్వరుడికి అప్పగించెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు మిక్కిలి సంతోషపడి కుమ్మరి గుండయ్యని చల్లగా వర్థిల్లుగాక అని దీవించిరి.

## మేదరి కేతయ్య

మేదరి కేతయ్య పరమేశ్వరునికి నమస్కరించి "స్వామీ పరమేశ్వరా! నన్ను పుట్టించిన కారణమేమి?" అని అడిగెను. అప్పుడు పరమేశ్వరుడు "మేదరి కేతయ్యా! నీ యొక్క తల్లియైన పార్వతీదేవి కేదారేశ్వర వ్రతము అచరించుచున్నది కావున వ్రతమునకు కావలసిన సామాగ్రి సమకూరినను వాయినం ఇచ్చుటకు చాట సమకూరలేదు. కావున, నీవు ఒక కట్టెతో చాట తయారు చేసి ఇవ్వగలవు" అని చెప్పెను. అప్పుడు కేతయ్య పరమేశ్వరుడితో "స్వామీ! ఈ అరణ్యంలో టేకు, మద్ది, చెనంగులు, తిరుమండ్లు, అను నానారకముల వృక్షములు కలవు. అందులో ఏ వృక్షం యొక్క కట్టెతో నేను చాటను తయారు చేయవలెను" అని అడుగగా పరమే శ్వరుడు ఆలోచించి తన కంఠమందున్న సర్పమును అరణ్యములోకి విసిరెను. అప్పుడు ఆ సర్పం మహేంద్ర పర్వతంపైన తలక్రిందులుగా పడి, ఆసర్పమే వెదుటి లంకగా మారెను. తదుపరి పరమేశ్వరుడు కేతయ్యతో "కేతయ్యా! మహేంద్రపర్వతం పైన ఉ న్న వెదుటి లంకను తీసుకొని రమ్ము" అని ఆజ్ఞాపించెను. వెంటనే మేదరి కేతయ్య పరమేశ్వరుడితో "పరమేశ్వరా! వెదుటి లంకను తీసుకొని రావడానికి నావద్ద ఎటువంటి ఆయుధము లేదు కదా! మరి నేను ఎలా తీసుకొని రాగలను" అని అడుగగా వెంటనే పరమేశ్వరుడు తన దగ్గర వున్న "చంద్రాయుధం (ఖడ్గం, ఒడ్డు కత్తి)"ను ఇచ్చెను. తర్వాత కేతయ్య పరమేశ్వరునితో "పరమేశ్వరా! నేను వెదుటి లంకను ఎలా

ఖండించగలను” అని అడుగగా పరమేశ్వరుడు “కేతయ్యా! నడుము వంచకుండా ఖండించవలెను మరియు బొంగులు తిప్పుతూ రిల్లెలు (రెమ్మలు) లేకుండా గెనేలు ఉండేలా చూచి ఖండించవలెను. అలా ఇరవై ఒక్క బొంగులు ఖండించి తీసుకొని రమ్ము” అని ఆజ్ఞాపించెను వెంటనే మేదరి కేతయ్య పరమేశ్వరుడికి నమస్కరించి చంద్రాయుధం తీసుకొని అడవికి బయల్దేరెను. కేతయ్య మహేంద్ర పర్వతం మీదికి చేరుకొని పరీక్షించగా అక్కడ నానా రకముల వృక్షములు కనబడెను. అందులో వెదుటి లంక కనిపించక పోవటంతో నిరాశతో ముందుకు నడువగా అక్కడ వెదుటి లంక కనిపించెను. ఆ వెదుటి లంక వృక్షము పొదలు పొదలుగా, చాలా రిల్లలు కలిగివుండడం చేత కేతయ్య చెట్టుని చూసి భయపడి తనలో తాను “ఆ పరమేశ్వరుడు ఎంతో చక్కనైన వృక్షములను వదలి ఈ గుబులు గుబులుగా వున్న వృక్షమునే ఖండించి తీసుకొని రమ్మని ఆజ్ఞాపించెను కదా!” అని కోపంతో విచారించి అచటనే కూర్చుండిపోయెను. ఆ సమయమునందు వట వృక్షము క్రింద కేతయ్య కొరకు పార్వతీ పరమేశ్వరులు వేచివున్నారు. అంతటా పార్వతి పరమేశ్వరునితో “స్వామీ! వ్రతము చేయవలసిన సమయము కావచ్చుచున్నది. వాయినము కోసం చాట కావలెను. చాట తయారీ కోసం వెళ్ళిన కేతయ్య ఇంకనూ రాలేదు కావున, మీరు ఒకసారి వెళ్ళి కేతయ్యను పిలుచుకురండి” అని చెప్పెను. వెంటనే పరమేశ్వరుడు అరణ్యములోకి వెళ్ళి ఒక పర్వతము పై నిల్చుండి కేతయ్యను మూడు సార్లు పిలిచెను. ఎంత పిలిచినను కేతయ్య పలుకకపోయేసరికి పరమేశ్వరుడు ఆగ్రహంతో చివరిగా “ఓ కేతయ్యా ఎంత పిలిచినా గర్వంతో పలుకడం లేదు కదా! నీవు ఇప్పుడు మహేంద్ర పర్వతం దిగి వస్తేనే సరి. లేని యెడల నీకు శాపం ఇచ్చెదను” అని చెప్పెను. అప్పుడు కేతయ్య శాపభయంతో వెదుటి లంకను ఖడ్గంతో ఖండించి, రిల్లలు నరికి వేసి ఇరవై ఒక్క గెనెలు గల ఇరవై ఒక్క బొంగులను తీసుకువచ్చి వటవృక్షం క్రింద కోపంతో పడవేసెను. పిమ్మట పరమేశ్వరుడు పార్వతీదేవితో “అరణ్యములో తిరుగు వారికి ఆకలి ఎక్కువ కదా! అందుకు కేతయ్యకి భోజనము పెట్టుము”అని చెప్పెను. అప్పుడు పార్వతీదేవి కేతయ్యకి భోజనం పెట్టగా కేతయ్య భుజిస్తూ “నీ కడుపు సల్లగుండా!” అని దీవెన ఇవ్వగా పార్వతీదేవి ఆగ్రహంతో వెనుకకు తిరిగి “నేనే వరములిచ్చు దేవతను కదా! నాకు వరములిచ్చె అర్హత నీకేలా? నీవు అలా ఎందుకు అన్నావు” అని కేతయ్యని ప్రశ్నించెను. వెంటనే కేతయ్య పార్వతీదేవితో “ఓ తల్లీ! ఆ

వెదుటి లంకలు గంగలో, కుంటలో పడుగాకా!!" అని అనెను. అప్పుడు పార్వతీ దేవి కేతయ్యతో ఎందుకు అలా అన్నావని ప్రశ్నించగా కేతయ్య పార్వతీదేవితో "తల్లీ! వెదుటి లంకలు నా భుజంపై తెచ్చు సమయాన నా భుజం మీద రిల్లలు కుచ్చుకొనిపోయి రక్తం కారెను. కావున, ఆ బాధతో నేను అలా అంటిని" అని వివరించెను. వెంటనే పార్వతీదేవి చింతించి కేతయ్యతో "కేతయ్యా ! నీకు అరణ్యములో ఎలాంటి భయాందోళనలు, కీడు కలగకుండా నీ వెనకే నేవుంటా" అని తన భుజం మీద చేయివేసి వరము ఇచ్చెను. తదుపరి పరమేశ్వరుడు కేతయ్యతో "కేతయ్యా! నీవు చాటను తయారుచేయుము" అని ఆజ్ఞాపించగా కేతయ్య మూర్ఖత్వంతో నేను చేయను అని మొండిగా కూర్చుండెను. వెంటనే పరమేశ్వరుడు "కేతయ్యా ! నీవు మాత్రమే ఈ పనిని చేయగలవు ఇంకెవరు చేయలేరు" అని అనెను. అయినను కేతయ్య వినక మూర్ఖంగా కూర్చుండెను.

తదుపరి పార్వతీదేవి పరమేశ్వరునితో "స్వామీ! వ్రతమునకు సమయము ఆసన్నమౌచున్నది కదా! నాకు చాట కావలెయును" అని అడిగెను. అప్పుడు పరమేశ్వరుడు పార్వతీదేవితో "దేవీ! నేను ఎంత చెప్పినను కేతయ్య మొండిగా నేను చేయను అని కూర్చున్నాడు. నేను ఏమి చేయగలను?" అని చెప్పగా వెంటనే పార్వతీదేవి కేతయ్య బాధను గ్రహించి పరమేశ్వరునితో "స్వామీ! మీరు తీసుకురమ్మన్న వెదుటి లంకలు గట్టిగా వుండడం వల్ల కేతయ్య చెయ్యను అని అంటున్నాడు" అని పలికెను. వెంటనే పరమేశ్వరుడు "వెదుటి లంకలు బొంగులుగా మారును గాక!" అని శాపము ఇచ్చెను. ఆ శాపముతో వెదుటి లంకలు బొంగులుగా మారెను. అప్పుడు పరమేశ్వరుడు కేతయ్యతో "కేతయ్యా ఇప్పుడు ఈ బొంగులతో చాటలు తయారు చేయడం నీకు సులువే! అది ఎలా అంటే బొంగులోని మొదటి గెనెలోని గీత ఎదురుగా కత్తి పెట్టి ఖండించి మూడు గెనెల తదుపరి సగభాగంపైన కాలితో అదిమి విరిచినప్పుడు రెండు సుగ్గులు, రెండు గెనె బద్దలుగా వచ్చును. ఈ బద్దలను సన్నగా చీరి చాట అల్లవలెను. అందులో నా శరీరం మీద ఎన్ని బొట్లు వుంటాయో అన్ని కట్లు కట్టవలెను. ముందుగా మూడు బేరెలు వేసి ఆ బేరెల మీద కఱ్ఱ పెట్టి నాల్గవ బేరెతో ఎదురు మలుపవలెను. తదుపరి రెండు మూలలు అల్లవలెను. అటు తదుపరి పదకొండు కట్లు కట్టవలెను. కట్టిన తదుపరి కొమ్ములను తెగగొట్టవలెను. ఈ చాట 'లక్ష్మీదేవి స్వరూపం' కావున తెలియకుండా ఎవరి కాలికి ఐనా తగిలిన

నమస్కరించవలెను లేని యెడల దరిద్రము కలుగును" అని చెప్పెను.

అప్పుడు కేతయ్య పరమేశ్వరునితో "స్వామి మరి చాట లక్ష్మీదేవి స్వరూపం అంటివి కదా! మరి నేను చాటను తయారు చేసినప్పుడు చాట నా కాలి వద్దే వుండును కదా! అటులైన నాకునూ దరిద్రం కలుగునా!" అని అడిగెను. అప్పుడు పరమేశ్వరుడు కేతయ్యతో "కేతయ్యా! ఎవరైతే చాటను తయారు చేసాక చాటకు నమస్కరిస్తారో అటువంటి వారికి ఎటువంటి దరిద్రము కలగదు" అని చెప్పెను. కేతయ్య పరమేశ్వరుడు చెప్పిన విధంగానే చాటను తయారుచేసి పార్వతీదేవికి అప్పగించి నమస్కరించెను. అప్పుడు పార్వతీదేవి సంతసించి వ్రతము ప్రారంభిం చెను. చాటలో పూజ సామాగ్రి పెట్టి వ్రతము గావించి తదుపరి దేవాదిదేవతలకు వాయినములు ఇచ్చి ఆశీర్వదించి వరములు ఇచ్చెను. పిమ్మట దేవాదిదేవతలు తమతమ లోకాలకు వెళ్ళిరి. అప్పుడు పరమేశ్వరుడు పార్వతీదేవితో "దేవీ! నీవు ఆ అరణ్యములో ఇంతటి దివ్యమైన వ్రతమును ఆచరించితివి కదా! నీకు ఏ వరము కావాలో కోరుకో" అని అడుగగా అప్పుడు పార్వతీదేవి "స్వామీ!నాకు మీలో సగభాగం ఇవ్వుము" అని కోరెను. అంతట పరమేశ్వరుడు వెంటనే ఆ వరాన్ని ప్రసాదించి "అర్ధనారీశ్వరుడు" అయ్యెను. అటులనే మేదరి కేతయ్యకు, కుమ్మరి గుండయ్యకు "మీరు కలియుగమందున ప్రమదులై జన్మించుదురు గాక!"అని వరమిచ్చెను. అప్పుడు వారు సంతసించి మాకు ఎందుకు ఈ వరము అని పరమేశ్వరుడిని అడుగగా పరమేశ్వరుడు వారితో "మేదరి కేతయ్యా ! నీవు చాటలు, గుల్లలు, మొంటెలు, జల్లెడలు, విసరనకర్రలు మానవులకు తయారుచేసి ఇవ్వగలవు. అలాగే కుమ్మరి గుండయ్యా ! నీవు మానవులకు కుండలు, గురుగులు, కంచుళ్ళు తాయారుచేసి ఇవ్వవలెను కావున మీరు కలియుగమందున జన్మించగలరు" అని వరమిచ్చెను. పిమ్మట పార్వతీ పరమేశ్వరులు కైలాసము చేరుకొని అచట అర్ధనారీశ్వరులై సింహాసనంపై మునీశ్వరులచే పూజలందుకొనిరి. అప్పుడు భృంగీశ్వరుడు ఆ అర్ధనారీశ్వరులను చూసి కోపంతో వుండి కోపోద్రిక్తుడై "నేను పరమేశ్వరుడిని మాత్రమే పూజింతును కదా ! ఇప్పుడు నేను ఎలా ఈ అర్ధనారీశ్వరులను పూజింతును" అని తనలో తాను విచారించుచు నేను పరమేశ్వరునికి మాత్రమే పూజ చేస్తాను అని తపోనిష్ఠతో "తుమ్మెద" గా మారెను. తదుపరి భృంగీశ్వరుడు అర్ధనారీశ్వరునిలో సగభాగం అనగా పరమేశ్వరుడిని మాత్రమే పూజించి, పూజ అనంతరం పరమేశ్వరుడికి మాత్రమే ప్రదక్షిణ చేయదలచి అర్ధనారీశ్వరుల శరీరం

మద్య భాగములో రంధ్రము చేసి పరమేశ్వరుడి చుట్టు ప్రదక్షిణ చేసెను. అంతట పార్వతీ పరమేశ్వరులు ఆగ్రహించిన వారై భృంగీశ్వరునితో "ఓరి మూర్ఖా! మేమిరు వురం ఒకే శరీరముతో ఏకమై వున్నా నీవు మమ్ములను వేరు చేసి పూజించుచుంటివి కావున నీవు ఏ రూపంగా నైతే మమ్ములను వేరు చేసావో ఆ రూపంతోనే (తుమ్మెద) జన్మించుదువుగాక" అని శాపం ఇచ్చెను.

మేదరి కేతయ్య కుమ్మరి గుండయ్యలు ప్రమదులై జన్మించిరి. ప్రతి దినము కేతయ్య ఉదయం లేచి అరణ్యమునకు వెళ్ళి నిత్యము ఐదు వెదురు బొంగులను ఖండించి తన ఇంటికి తీసుకువచ్చి వాటిని చీరి చాటలు, గుల్లలు తయారుచేసి వాటిని గ్రామములో అమ్మి వచ్చిన డబ్బుతో పూజా సామాగ్రి, వంటసామానులు తెచ్చేవాడు. అప్పుడు అతని భార్య అయిన వీరమాంబ ఇంటి పనులను చక్కదిద్ది అచట నుండి పూజా సామాగ్రిని, వంట సరుకులను జంగమయ్యలకు ఇచ్చి జంగమయ్యలు వండిన పదార్థములను పరమేశ్వరునికి నివేదన ఇచ్చి ఆ తదుపరి తీర్థ ప్రసాదములు తీసుకొని పిదప భుజించేవారు. ఇలానే ప్రతి నిత్యం చేయుచుండెను. అటుల కొన్ని సంవత్సరములు గడిచిన పిమ్మట ఒకనాడు పార్వతీ పరమేశ్వరులు కైలాసమున కొలువైన సమయమున పార్వతీదేవి పరమేశ్వరునితో "స్వామీ! మన భక్తులైన కేతయ్య దంపతుల జీవనం కష్టంగా వుంది కదా! వారికి ఎటులనైన ద్రవ్యమును సమకూర్చుము" అని కోరగా అపుడు పరమేశ్వరుడు పార్వతీదేవితో "దేవీ! కేతయ్య ఉచిత సంపాదనను స్వీకరించదు కదా! కావున వెదురు బొంగులలో వజ్రములు నింపుతాను" అని చెప్పెను. పిమ్మట ఒకనాడు కేతయ్య ఉదయం లేచి వీరమాంబతో "వీరమాంబా! నేను అరణ్యమునకు వెళ్ళుచున్నాను వచ్చేసరికి ఇల్లు శుభ్రపరుచుము" అని చెప్పి అడవికి వెడలెను. ఎప్పటిలాగే కేతయ్య బొంగులు ఖండించగా గల గల అను శబ్దములు విన్నవాడై ఆ బొంగులలో కీటకములు ఉన్నాయని భావించి, అవి చాటల తయారీకి పనికి రావని వాటిని వదిలి అలా చాలా బొంగులను నరికి వేసెను. మరికొన్ని బొంగులను నరికి చూడగా అందులో నుండి వజ్రములు పడెను. వాటిని కేతయ్య పురుగులుగా భావించి "ఛీ ఛీ" అని పడవేసెను వెంటనే ఆ వజ్రములు మిణుగురు పురుగులై ఎగిరిపోయెను. అదే విధముగా నాలుగు దిశలలో తిరుగుతూ అక్కడ బొంగులను ఖండించినను అవే వజ్రములు కనిపించెను. అప్పుడు మేదరి కేతయ్య విచారించుచూ, చింతతో ఎన్నడూ

లేని ఈ పురుగులు ఇప్పుడు ఈ బొంగులలో చేరెను అని బాధపడుతూ కేతయ్య ముందుకు వెళ్ళగా ఒక పుట్ట కనిపించెను ఆ పుట్టయందు మునీశ్వరుడు తపస్సు చేస్తూ వుండెను. ఆ పుట్ట మీద వెదుటి లంక పొదలు పొదలుగా వుండెను. అన్ని చెట్ల కన్న ఈ చెట్టు పచ్చగా వుందని చూచి ఆ వృక్షమును నరికివేయాలనే ఆలోచనతో ఖడ్గమును తీయగా తన చేతిలో నుండి ఖడ్గము జారి పుట్టలో పడెను. అప్పుడు తన ఖడ్గము అందులో తపస్సు చేయుచున్న మునీశ్వరుడు శిరస్సుపై పడి అతడు మరణించెను. అది చూచిన కేతయ్య బాధతో భయంతో దుఃఖించుచూ అచటనే కూర్చుండెను. ఆ సమయము నందు కేతయ్య బార్య ఐన వీరమాంబ తన భర్త ఇంకనూ రాకపోయేసరికి బాధపడుతూ ఆందోళనతో తన భర్తను వెతుకుటకు అరణ్యమునకు వెళ్ళెను. అలా తిరుగుతూ తిరుగుతూ ఉత్తరదిశకు వెడలి చూసేసరికి అచట కేతయ్య దుఃఖించుచూ కూర్చుండెను. వీరమాంబ తన భర్త వద్దకు వెళ్ళి "స్వామీ! మీరు ఎందుకు దుఃఖించుచున్నారు" అని అడుగగా అప్పుడు కేతయ్య "ఓ వీరమాంబా, పుట్టయందు తపస్సు చేయుచున్న మునీశ్వరుని శిరస్సుపై నా చేతి నుండి ఖడ్గము జారిపడి అతను మరణించెను. దీనికి ప్రాయశ్చిత్తము ఏమిటి?" అని అడుగగా వీరమాంబ "ఈ పాపము తొలగవలెనన్నను అతనిని చంపినవారు మరణించవలెను. అప్పుడే ఈపాప పరిష్కారము"అని చెప్పెను. వెంటనే కేతయ్య "మునీశ్వరుడిని చంపినది నేనే కదా! అందులకు నేను నా శిరస్సు ఖండించుకొని మరణము పొందెదను" అని అనగా అపుడు వీరమాంబ కేతయ్యతో "స్వామీ! మీరు మరణించిన తర్వాత నేను బ్రతికి ఎందులకు? కావున ముందు నా శిరస్సు ఖండించి తదుపరి మీయొక్క శిరస్సు ఖండించుకొనుము. అప్పుడు మీ పాపము తొలిగిపోవును" అని చెప్పెను. అలా కేతయ్య, వీరమాంబలు మరణించుటకు సిద్ధపడిరి. అట్టి సమయమున కైలాసమునందున పార్వతీపరమేశ్వరులు ఇదంతయు గమనించుచూ విచార పడుచుండిరి ఎందుకనగా కేతయ్య దంపతులు మరణించిన భూలోకములో చాటలు, గుల్లలు చేసేవారు ఎవరూ లేరు కదా! మరి ఎలా అని ఆలోచించుచుంటిరి. అప్పుడు పరమేశ్వరుడు పార్వతితో "ఓ పార్వతీదేవి నేను కేతయ్యని పరీక్షించుటకే ఇదంతయు చేసితిని కాని అతడు మరణించుటకు కాదు. కావున నేను అతనిని చావనివ్వను" అని పలికి పార్వతీ పరమేశ్వరులు అరణ్యమునకు చేరి అచట వున్న కేతయ్య దంపతులకు దర్శనమిచ్చి కేతయ్యతో "కేతయ్యా! నీవు నీ భార్యను చంపుట

మహా పాపము కదా!" అని అనగా అప్పుడు కేతయ్య పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి "పరమేశ్వరా! తపోనిష్ఠలో వున్న మునీశ్వరున్ని చంపిన కలుగు పాపము కన్నా భార్యను చంపుట పాపమా?" అని చెప్పగా అప్పుడు పరమేశ్వరుడు "కేతయ్యా మునీశ్వరుడు మరణించలేదు ఇదంతయు జరుగుటకు కారణము నేనే" అని సమాధానమిచ్చెను. పిమ్మట కేతయ్య పరమేశ్వరునితో "స్వామీ! మునీశ్వరుడు నా ఖడ్గము వలనే మరణించెను. అతను మరణించడం నేను చూసితిని" అని అనగా పరమేశ్వరుడు కేతయ్యతో "కేతయ్యా! నీవు ఒక సారి మునీశ్వరుని లేపి చూడుము. అప్పుడు తను లేచును" అని చెప్పగా కేతయ్య మునీశ్వరుడిని తట్టి లేపగా అతడు లేచెను. అప్పుడు కేతయ్య దంపతులు ఆదిదంపతులకు నమస్కరించి మమ్ములను కూడా కైలాసమునకు తీసుకుపొమ్ము అని వేడుకొనిరి. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు కేతయ్య దంపతులకు "మీకు సంతానసిద్ధి కలుగుగాక! అలాగే మీకు ఐదుగురు కుమారులు జన్మించుగాక! వారు ప్రమదులై జీవించుగాక!! ప్రపంచమందు వారు కీర్తిచెంది నీ వంశావళి వృద్ధి పొందుగాక! పిమ్మట మీకు కైలాస ప్రాప్తి కలుగును" అని దీవెన ఇచ్చెను.

కొన్ని సంవత్సరముల తర్వాత కేతయ్య దంపతులకు సంతానము కలిగి ఐదుగురు కమారులు జన్మించిరి. వారి నామములు బసవయ్య, చెన్నయ్య, దూడయ్య, వీరయ్య, శివయ్య. వారికి వివాహము కావించి వివాహానంతరము వారి ఇంటి వద్ద ప్రజలకు కావాల్సిన చాటలు, గుల్లలు, విసరన కర్రలు, జల్లెడలు ఇవ్వవలెను అని చెప్పగా ఆ కుమారులు కేతయ్యతో "తండ్రిగారు! ఈ వస్తువులు ఎలా తయారు చేయాలి, వాటికి కావాల్సిన సరుకులు ఎచట లభించును" అని అడుగగా అప్పుడు కేతయ్య "కుమారులారా! అరణ్యములోని ఐదు వెదురు బొంగులను ఖండించి తీసుకొని వచ్చి, వాటిని పగులకొట్టి వాటితో చాటలు, గుల్లలు తయారుచేసి వాటిని ప్రజలందరికి ఇవ్వుము" అని ఆదేశించగా కుమారులు ఆ ఆదేశాన్ని స్వీకరించెను. అటు పిమ్మట కేతయ్య దంపతులు బాధ్యతలను కుమారులకు అప్పగించి యాత్రలకు బయలుదేరిరి. మరునాడు పరమేశ్వరుడు కేతయ్య కుమారులకు ధనాశ వున్నదా? లేదా ? అని పరీక్షింపదలిచి అరణ్యములో వున్న బొంగులలో వజ్రాలు నింపెను. ఆ సమయము నందు కేతయ్య కుమారులు అరణ్యమునకు వెళ్ళి ఒక్కొక్కరు ఐదు చొప్పున వెదురు బొంగులను ఖండించి తీసుకొని వచ్చి పగులగొట్టి చూడగా అందులో వజ్రాలు

వుండెను. వారు ఆ వజ్రాలను అమ్మి వచ్చిన ఆదాయంతో జీవనం సాగించిరి. అలా ధనాశతో ప్రతిరోజు అరణ్యమునకు వెళ్ళి ఆ బొంగులను తెచ్చి వాటిని ఖండించగా వచ్చిన వజ్రాలను అమ్ముకొని మేడలు, మిద్దెలు కట్టుకొని వుండసాగిరి. ధనికులు అన్న గర్వంతో చాటలు, గుల్లలు చేయడం మానివేసిరి. ఇలా వుండగా కొన్ని సంవత్సరముల తర్వాత కేతయ్య దంపతులు యాత్రా దర్శనం చేసుకొని తమ గ్రామానికి తిరిగి వచ్చిరి. వారు వచ్చుచుండగా మార్గ మద్యమంలో గ్రామ ప్రజలు ఆందోళన చెందుతూ బాధపడుతుండడం గమనించి ప్రజల వద్దకు వెళ్ళి ఆరాతీసిరి. అప్పుడు ప్రజలు కేతయ్యతో "కేతయ్యా! మాకు చాటలు, గుల్లలు లేవు అందుకే మాకు ఈ ఆందోళన. మీరు ఎలాగైన మాకు చాటలు, గుల్లలు ఇవ్వగలరని కోరుతున్నాము" అని ప్రార్థించిరి. అప్పుడు కేతయ్య ప్రజలతో నేను తెచ్చి ఇచ్చెదనని చెప్పి వారి ఇంటికి పయనమయ్యెను. కేతయ్యకు తన ఇల్లు కనబడకుండా వుండడం వల్ల ముందుకి వెళ్లసాగెను. అలా వెళ్తుండగా ఒక పెద్దమనిషి కనిపించగా అతడిని కేతయ్య "ఓ పెద్దమనిషీ! మా ఇళ్ళు ఎక్కడ?" అని అడగగా అప్పుడు ఆ పెద్దమనిషి "కేతయ్యా! నీవు మీ ఇళ్ళు దాటి ముందుకు వచ్చావు. అదిగో అక్కడ కనిపించే బజారులోని మేడ, మిద్దె ఇళ్ళు మీవే" అని పలికెను. అప్పుడు కేతయ్య దంపతులు వెనుదిరిగి మిద్దె ఇంటివైపు వెళ్ళి వారి ఇంటిని చూసి ఆశ్చర్యపోయెను. ఆ ఇంట్లోకి వెళ్ళకుండా ఇంటి బయట నుండే వారి కుమారులను పిలిచెను. ఆ పిలుపునకు మేడమీద వున్న కేతయ్య కుమారులు, వారి భార్యలు, వారి పిల్లలు మేడమీద నుండే కేతయ్య దంపతులను చూసి "ఓ ముసలివాడా! ఎందుకు అరుస్తున్నావు? ఇంట్లోకి రండి" అని పిలిచెను. అప్పుడు కేతయ్య తన కుమారులను కిందకు రమ్మని చెప్పెను. క్రిందకి వచ్చిన తర్వాత కుమారులతో "కుమారులారా! మీకు ఈ ఇళ్ళు కట్టుటకు ద్రవ్యం ఎక్కడిది?" అని అడుగగా కుమారులు జరిగినదంతా చెప్పిరి. అప్పుడు అదంతయు విన్న కేతయ్య కోపంతో "కుమారులారా! ప్రజలకు చాటలు, గుల్లలు చేసి ఇవ్వవలెను" అని ఆదేశించెను. కాని, కుమారులు "మేము చేసిఇవ్వము"అని చెప్పగా కేతయ్య వారికి "ఈ ద్రవ్యము మీకు ఎలాగైతే వచ్చినదో అలాగే పోవును గాక" అని శాపము ఇచ్చి అరణ్యమునకు వెళ్ళిరి. అక్కడ కేతయ్యదంపతులు బాధపడుతూ పార్వతీ పరమేశ్వరులను వేడుకొనుచుండిరి. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు కేతయ్య దంపతులకు దర్శనమిచ్చి "కేతయ్యా!, వీరమాంబా! మీకు ఏమి కావలయునో

కోరుకొనుము" అని అనగా కేతయ్య దంపతులు "స్వామీ! మాకు కైలాస ప్రాప్తి కలిగించుము" అనికోరగా పార్వతీ పరమేశ్వరులు, తథాస్తు" అనెను. కేతయ్య కైలాసమునకేగుతూ తన కుమారులకు "మీ పనియే మీకు జీవనాధారము" అని వరమిచ్చెను. అలా వెళ్ళే సమయమునందు పరమేశ్వరుడితో కేతయ్య "పరమేశ్వరా! మీరు దక్షిణకాశి అయిన కొలనుపాకలో "కేతేశ్వరస్వామి" వై నిలువవలెను. మా వంశీకులు మిమ్ములను ఎల్లవేళలా పూజింతురు గాక! మిమ్ములను పూజించిన వారికి ధన, దాన్యాభివృద్ధి, వంశాభివృద్ధి కలిగి వుండునటుల మీరు వరము ఇవ్వవలెను" అని ప్రార్థించి కేతయ్య దంపతులు శివలోక ప్రాప్తి పొందిరి. అదే లింగస్థాపన అయ్యి తదనంతరం కేతేశ్వర స్వామిగా పిలువబడుచుండెను.

కేతయ్య కుమారులు వారి ధనమంతా నశించి యధాస్థితిగా చాటలు మరియు గుల్లలు తయారుచేస్తూ వాటిని అమ్మి వచ్చిన ఆదాయముతో జీవనాన్ని కొనసాగించిరి.

## శెట్టి కులములు ఐదు, అవి ఏమనగా

1. కోమటి శెట్టి
2. మేదరిశెట్టి
3. కుమ్మరిశెట్టి
4. గౌడశెట్టి
5. బలిజశెట్టి

ఈ ఐదు కులములు రుద్రాక్ష మాలలు, లింగములు, విభూది రేఖలు ధరించిన వారై నిత్యము శివపూజ చేసుకొని భోజనము భుజించేవారు. ఒకానొక సమయమునందు వీరు అరణ్యమునకు వెళ్ళి అక్కడ తిరుగుతూ దప్పిక కలిగి ప్రక్కనే వున్న సముద్రములోని నీటిని తాగి దప్పిక తీర్చుకొనెదమని అనుకొనెను. అంతలో వారిలో వున్న కొంత మంది వేరే కులస్థులు 'ఈ సముద్రము నీటిని తాగితే దాహం తీరదు కాన సముద్రం ఆవల కల్పవృక్షములు (తాటిచెట్టు) కలవు. అది అమృతాన్ని (కల్లు) ఇచ్చును దానిని తాగిన యెడల దాహం తీరును' అని చెప్పిరి. అప్పుడు ఈ శెట్టి కులస్థులు వారితో "అయ్యా! మేము లింగములు ధరించి యుంటిమి కదా! మేము ఎటుల తాగగలము" అని అనగా వేరే కులస్థులు శెట్టి కులస్థులతో "స్వామీ!

మీరు ధరించిన ఆ లింగములను తీసి సముద్రములో వుంచి వచ్చిన పిదప స్నానం ఆచరించి మరల ధరించండి " అని చెప్పిరి. అలా తీసి వుంచిన లింగములకు కాపలాగ బలిజ శెట్టిని వుంచి వీరు కల్పవృక్షము వద్దకు చేరి అమృతము సేవించి అక్కడే వుండిరి. తెల్లవారు జామున లేచి లింగములను గుర్తు తెచ్చుకొని సముద్రమునకు వెళ్ళి స్నానమాచరించి లింగములను వెతుకగా లింగములు కనిపించలేదు అప్పుడు శెట్టి కులస్థులు కాపలాగ వున్న బలిజశెట్టిని "బలిజశెట్టి, మా లింగములు కనిపించుట లేదు. ఎక్కడ పోయాయి?" అని అడుగగా, బలిజశెట్టి "నేను తీయలేదు, ఇచటకు ఎవరు రాలేదు" అని చెప్పెను. అప్పుడు కోపంతో శెట్టి కులస్థులు బలిజశెట్టిని అనుమానించి కొట్టసాగిరి. ఆ సమయము నందు ఆకాశవాణి "ఓశెట్టి కులస్థులారా! మీరు మీ లింగములను తీసి ఏ అమృతము ఐతే సేవించుటకు వెళ్ళారో అదే అమృతము ఎల్లప్పుడు సేవించుదురుగాక! మీ లింగములు దుంపలుగా మారిపోవుగాక! ఈ దుంపలనే జనులందరు భుజింతురు గాక!" అని శాపము ఇచ్చెను. అప్పటి నుండి బలిజశెట్టి మాత్రమే లింగమును ధరించన వారై మిగిలిన కులస్థులు లింగము ధరించక అమృతాన్ని సేవిస్తూ జనులకు పని సామాగ్రి అందిస్తూ జీవనం సాగిస్తుండిరి.



## మేదరిమఠం గురువులు



మేదరిమఠం నాగేంద్రయ్య
cell : 9290991708



మేదరిమఠం ప్రవీణ్‌స్వామి
cell : 9704922629